# అభిమన్యుఁడు



పూర్వము పరశురాముఁడు సకలక్షత్రియవీర కంఠనాళములను నిశాతకుఠారధారల ఖండించి, తద్రక్తధారాపూరితంబుగ నైదుమడుఁగులుగావించి యందలి రక్తజలములతోడనే పితృతర్పణ మొనర్చి తనప్రతిజ్ఞ నిర్వహించుకొనియె. అందుచే నాసమీపప్రదేశమునకు శమంతకపంచకమను పేరువచ్చెను. కురుపాండవుల మహాసంగ్రామ మాప్రదేశముననే జరుగుటచే నాశమంతకపంచకమునకుఁ గురుక్షేత్రమనియుఁ బేరుగలదు.

భీష్మద్రోణాది ధనుర్వేదపారంగతుల యోగనిద్రకువీరశయ్యయై, భీమార్జునప్రముఖులగు వీరాగ్రగణ్యుల రణక్రియాకౌశలప్రదర్శనమునకు రంగస్థలమై యనేకభారతవీరుల వీరస్వర్గారోహణమునకుఁ బ్రథమసోపానమై, నాఁడుమొదలు వీరరసస్ఫురితములగు మహాభారతయుద్ధగాథల దిగంతములవరకుఁ బ్రకటించుచు, నానాటికిఁ గాశీ గయా ప్రయాగాది దివ్యక్షేత్రములలోఁ బరిగణింపఁబడిన యీకురుక్షేత్రమును స్మరించునెడ ప్రతిభారతీయునకు శరీరప్రకంపన ముదయింపక పోదు.

భారతవర్ష కుమారవీరులలో వీరాగ్రణియగు నభిమన్యుని సంగరక్రీడాపాటవమున కాటచోటై, వానియశశ్చంద్రికల ముల్లోకములు వ్యాపింపఁజేసిన దీకురుక్షేత్రమే యగుటచే నభి

మన్యుని జీవితచారిత్రమునుజదువు మాపాఠకులకీ పవిత్రక్షేత్రము నొక్కమారు దృష్టికిఁ దెచ్చితిమి. సుప్రసిద్ధుఁడగు మహాపురుషుని జీవితచరిత్రములో నాతని ప్రసిద్ధికిఁ గారణభూతమగు మహాపదార్థమును మొదట నెఱిఁగినఁగాని తత్కథావిధానము పాఠకునకంత హృదయంగమముగానుండదు. మహాభారతయుద్ధకథారత్నములకీ కురుక్షేత్రము పెన్నిధి. రత్నకూటమునంగల యొకానొక రత్నమును బరీక్షింపఁ బ్రయత్నించుటకన్నఁ దత్కూటమునుండి యద్దాని వేరుపఱచు నెడఁ దద్రత్నప్రభావిశేషము మిక్కిలి సుగ్రాహ్యమగునుగదా ? అందుచేమేమీయభిమన్యుకథారత్నమును బ్రత్యేకించి విమర్శించుచున్నారము.

పురుషుని గౌరవాగౌరవ నిర్ణయమునకుఁ గుణశీలములు సాధనములు. మనకథానాయకుఁడగు నభిమన్యుఁడు, మహేశ్వరదత్తపాశుపతాద్యఖిల దివ్యాస్త్రమండితుండును, సకలవీరారాతికులకాంతార దావానలుండును, పాండవమధ్యముండునగు నర్జునునకు శ్రీకృష్ణసోదరియగు సుభద్రాదేవియందు జనించిన యేకపుత్రుఁడు. దేవేంద్రుని యనుంగుమనుమఁడు. కృష్ణభగవానుని ముద్దులమేనల్లుఁడు.

"ఉ. ధన్యులకా సుభద్రకును శ ♦ క్రసుపుత్రున కుద్భవించె న
మ్మాన్యయశుండు పుత్రుఁ డభి ♦ మన్యుఁడు ధైర్యనిధుం డనన్య సా
మాన్యపరాక్రమప్రబల ♦ మన్యుఁడు పుణ్యచరిత్రుఁ డన్యరా
జన్య భయంకరుండు రణ ♦ శౌర్యుఁడు పాండవవంశకర్తయై"

తల్లులకును దండ్రికిని సకలబంధుజనులకును నభిమన్యునిజననము మహానందసంధాయకమైనది. ప్రమోదభరితుఁ



డై ధర్మజుఁడాపుణ్యదినమున వేదవేదులును నిరంతరవ్రతులును చతుర్ముఖసన్నిభులునగు బ్రాహ్మణముఖ్యులరప్పించి, సువర్ణభూషణములను, గోధనములు మొదలగు దానముల వారలఁ దృప్తిపరచెను. వేదవేదాంగవిదుఁడును పాండవ పురోహితుఁడునగు ధౌమ్యుఁడాబాలకునకు జాతకర్మమునొనర్చి, యాతఁడే క్రమక్రమముగఁ జౌలోపనయనాది విధివిధానములఁగూడ నిర్వర్తించెను. జాతకర్మనిర్మాణమున నభిమన్యుని జీవితము నందలి భవిష్యద్విషయములన్నియు ధౌమ్యుఁడు గ్రహించియేయుండును. అన్నివిషయములుఁగాకపోయినను ప్రధానాంశమగు నాతని యాయుఃపరిమాణమునయిన నమ్మహానీయుఁడు గుర్తించియుండకుండునా? కాని తాను గ్రహించినవిషయములలో విషాదాంశముల గూఢపరచి, శుభాంశములనే యాతఁడర్జునాదులకెఱింగించియుండును. ఏనాఁడయినను సాధారణముగ జ్యోతిషజ్ఞులకియ్యది సహజస్వభావమేకదా?

పాండవులకు ద్రౌపదియందు జనించిన యుపపాండవులలో నర్జునునకు శ్రుతకీర్తియను కుమారుఁడు కలఁడు. మహాభారతయుద్ధమున నీశ్రుతకీర్తి కాని, తక్కినయుపపాండవులుగాని, యభిమన్యునంతటి సుప్రసిద్ధులు కారు. అభిమన్యుని శౌర్యప్రతాపములు వారిలోనెవ్వరికిఁగాని యున్నట్లు మహాభారతమున వర్ణింపఁబడియుండలేదు. బాల్యమునందే యర్జునుఁడు తనముద్దుకుమారునకు శస్త్రాస్త్రవిద్యారహస్యములనెల్ల నేర్పుచు వానిని దనయంతవానిగా నొనర్చెను. వేదాధ్యయనము ధౌమ్యునికడను ధనుర్వేదాధ్యయన మర్జునునికడను గావించుటచేతనే

యభిమన్యుఁడంతటి తేజశ్శాలియు, నంతటియస్త్రకళానిపుణుఁ
డును గాఁజాలెను.

మత్తకోకిల.

అదిఁగొ యీశు కృష్ణుచేదయ ♦ నావృతుండయి ధామ్యుతో
వేదమంగయుతంబుగాఁ జది ♦ వెన్ ధనంజయుతో ధను
ర్వేదమిమ్ముగ నభ్యసించెఁ బ్రి ♦ వీరవైరిబలాకినీ
భేదమార్గము లెల్ల నేర్చె న ♦ భేద్య విక్రమసంపదన్.

అభిమన్యుఁడొక్క యర్జునునికడనే కాక, శ్రీకృష్ణునకుఁ గుమారుఁడును, దనతండ్రికి శిష్యుఁడునగు ప్రద్యుమ్నుని కడఁ గూడఁ గొంతవరకు ధనుశ్శాస్త్రమభ్యసించెను. కాని యది కేవలమును ప్రారంభవిద్యయైయుండును. ఉన్నత ధనుర్విద్యారహస్యములును, శత్రువుల మహావ్యూహములు భేదించుమార్గములును దండ్రియే వానికి స్వయముగ నేర్పెను. ప్రద్యుమ్నాదికుమారులర్జునునికడ ధనుర్విద్యనభ్యసించుటకొక కారణముకనఁబడుచున్నది ద్రౌపదీస్వయంవరము, ఖాండవదహనము జరుగువరకు ధనుర్విద్యయందర్జునుని యసాధారణప్రజ్ఞ లోకమునకు స్పష్టముగ వెల్లడికాలేదు. స్వయంవరమునకు వచ్చిన యఖిల రాజవీరులకు నసాధ్యమైన మత్స్యయంత్రము నతిసూక్ష్మముగఁ దెగనేయుట మొదలగు నద్భుతకార్యములవలన నాకాలపు క్షత్రియవీరులలో నర్జునుఁడే యగ్రగణ్యుఁడని ప్రసిద్ధివడసెను. అందుచేనట్టి లోకైకవీరునికడనే తనతమ్ముఁడైన సాత్యకికిని, గుమారుఁడైన ప్రద్యుమ్నునకును ధనుశ్శాస్త్రము నభ్యసింపఁ జేయవలెనని కృష్ణుఁడు నిశ్చయించుకొని, తనయుద్దేశము వానికి

వెల్లడించియుండును. సుభద్రావివాహానంతరమునని౦ద్రప్రస్థపురమునందు ధనంజయుఁడు తనసోదరులతో సుఖమున్న దినములలోఁ బ్రద్యుమ్నాదులాతనికడ విలువిద్య నభ్యసించియుందురని మనమూహింపవచ్చును. అప్పుడే యభిమన్యుఁడు జనించుటయు విద్యాభ్యాసమునకు యుక్తవయస్కుఁడగుటయు, నర్జుననియోగమునఁ బ్రద్యుమ్నుఁడువానికిఁ బ్రారంభధనుర్విద్య నేర్పుటయుఁ దటస్థించియుండును. వనవాసమునకుఁ బూర్వము పాండవులు దాదాపుగ నిరువదియైదు సంవత్సరము లింద్రప్రస్థపురము పరిపాలించిరి. పైనివివరించినరీతిగ నభిమన్యుఁడును బ్రద్యుమ్నాదియదుకుమారులును నింద్రప్రస్థపురమున నీయిరువదియైదేఁడులు నిల్లే కడపిరనుటకు సంశయములేదు.

అభిమన్యుని విద్యాభ్యాస విషయమున మనము మఱువరాని యొకచిత్రకథకలదు. ఒకనాటి సాయంకాలమున రాజోద్యాన వనమధ్యమునందొక చంద్రకాంత శిలావేదికపై సుభద్రార్జునులు విశ్రమించి యుండిరఁట. అప్పుడర్జునుఁడు నిండుచూలాలగు నిల్లాలికి మనోవికాసమును గల్గించు ప్రసంగమును గావించుచుండెనఁట. ఆప్రసంగము సాధారణ స్త్రీపురుషోచితమైనదికాక కేవలయుద్ధప్రసంగమఁట. ఆయుద్ధప్రసంగమున నర్జునుఁడు పద్మవ్యూహమును బన్ను విధమును, దానిని భేదించునుపాయమును భేదించి లోనఁ బ్రవేశించుమార్గమును దనప్రియురాలికెఱింగించుచుండెనఁట. తల్లిగర్భముననున్న యభిమన్యుఁడదంతయు నాలకించుచుఁ బద్మవ్యూహక్రమమును దండ్రిచెప్పినంతవరకుఁ జక్కఁగ నేర్చుకొనియెనఁట. వ్యూహములోఁ బ్ర

వేశించువిధమును జెప్పినతరువాత, మఱల దానిని భేదించుకొని వెలుపలికివచ్చు మార్గమునుగూడ నర్జునుఁడామె కెఱింగించుట కుపక్రమించుచుండ, నాసంగతి శ్రీకృష్ణుఁడెట్లో తెలిసికొని పద్మవ్యూహాక్రమమంతయు సుభద్రాగర్భమునుండి యభిమన్యుఁడాలకించుచున్నాఁడనియు, నింకనావ్యూహమును భేదించుకొని వెలుపలికివచ్చు మార్గముఁగూడ నాతఁడభ్యసించినయెడల నాబాలకుఁడుజగదేకవీరుఁడయి సురాసురలకైన నజేయుఁడగుననియు వానిని సంహరించుటకుఁ దాను బ్రత్యేకముగ నొకయవతారమును దాల్పవలసి వచ్చుననియు నెంచి తటాలున నచ్చటఁబ్రిత్యక్షమై యర్జునునిజూచి "బావా! ఓహోహో! నీయుద్ధనైపుణ్య మంతయు నాడుదాని యెద్దనా ప్రకటించుచున్నావు? చాలుచాలు నింకరమ్ము;" అనినవ్వుచుఁ బరిహాసమాడి యాప్రసంగమునకు భంగము గల్గించెనఁట! సంస్కృతాంధ్రమహాభారతములయందీకథ గానరాకపోయినను వినుటకు మాత్రము వినోదకరముగా నున్నదని చెప్పకతీరదు. మహాభారతమునందలి కృష్ణుని ప్రవర్తనమిట్టిదని తెలియఁజేయుటకై యీకథకల్పింపఁబడియుండును.

ఈకథకల్పింపఁబడుటకు మహాభారతమునందలి

ఉ. అమ్మకనపోచ్చుచొప్పు తెలి • యన్నిగనె నంతిరొఃకాని యిమ్మలన్
గ్రిమ్మలుభంగి వాఁడువినఁ • గానఁడు··· ...

అను నర్జునవాక్యమాధారమైయుండునని మానమ్మకము.

పై నివివరించిన చిత్రకథయందలి సత్యాసత్యముల నింతకన్న విమర్శించుట మనకనవసరము. పాండవులింద్రప్రస్థపురముననున్నంతవరకు నభిమన్యుఁడచ్చటనేయుండి తండ్రియొద్దను బ్రద్యుమ్నునియొద్దను ధనుశ్శాస్త్రము నభ్యసించుచు దైవవశమునవారికి వనవాసము తటస్థించినంతనే యతఁడుతనతల్లితోడను సోదరులయిన ద్రౌపదేయులతోడను ద్వారకానగరమునకువిచ్చేసెను. పాండవులుగడపిన వనవాసాజ్ఞాతవాస కాలమగు పదుమూఁడేండ్లును నతఁడుద్వారకయందే ప్రద్యుమ్నుని శిక్షలోమెలఁగుచుండెను. వీరాగ్రగణ్యులును ధర్మమూర్తులునగు తనతండ్రులకు దుష్టులవలనఁగలిగిన కష్టములకు మిక్కిలి చింతిల్లుచు, మిక్కిలిచింతిల్లు తల్లినోదార్చుచుఁ, దల్లికన్నఁ బదిమడుఁగు లెక్కుడుగఁ దన్నుసంరక్షించు మేనమామలకడను, మేనత్తలకడను నభిమన్యుఁడు కడుముద్దుగసంచరించెను. తనకుఁబితృవియోగదుఃఖమును గల్గించిన దురాత్ములగు కౌరవులయెడఁ దనకసిదీర్చుకొనుటకుఁగాఁబోలుం నాస్వల్పకాలములోనే యాకుమార వీరుఁడు రణక్రియారహస్యములెన్నియో నేర్చుకొని యెన్నియోమారులు ద్వారకపైదండెత్తి వచ్చిన జరాసంధాదులతో శ్రీకృష్ణునకుఁ దటస్థించిన యుద్ధములలో యదువీరపుంగవులతోఁబాటుతానును హెచ్చరాహెచ్చరిగఁబోరాడి తనరణక్రియాకౌశలమంతయు వెల్లడించి యర్జునకుమారుఁడనియనిపించుకొనియెను. ఆహా! పుత్రునిఁగన్న తండ్రికింతకన్నఁ గోరఁదగినదేమైననుండునా?



## అభిమన్యుని వివాహము.

సాధారణముగ మహాపురుషులజీవితములు కష్టపూరితములు. అందుచేతనే నీతిదాయకములును మార్గదర్శకములునునై యవిమానవునకుఁ బ్రాపంచకజ్ఞానము గలిగించుచున్నవి. దుష్టులవలన సాధువు లెన్నికష్టములు వచ్చుచుండినను సర్వేశ్వరుని కటాక్షవీక్షణమొక్కసారియైన వారిపైఁ బ్రసరింపకపోదు. బాలార్కుని కిరణమొక్కటియైనను గాఢాంధకారమును నిమిషమాత్రమున నిశ్శేషమొనర్చునట్లు, ఆయొక్కకటాక్షవీక్షణమెంతటి కష్టములనయిన మరపించి సాధువులను బ్రహ్మానంద పరవశులఁ జేయుచుండును. అజ్ఞాతవాసాంతమున జరిగిన యభిమన్యుకుమారుని వివాహము, పదుమూఁడేడులకష్టకాలము నొక్కమారుమరపించి పాండునందనుల నమందానంద భరితుల నొనర్చెఁగదా? అభిమన్యుఁడు వివాహమాడినకన్యక యుత్తర. ఆ యుత్తర విరటునికూఁతురు. ఆవిరటునియొద్దనే పాండవులుతమ యజ్ఞాతవాస వత్సరమును మారువేషములతోఁ గడపిరి. ఉత్తరకునాట్యగురువై బృహన్నలయనుపేరునఁ బ్రవర్తించినవాఁడర్జునుఁడేయని తెలిసినంతనే విరటుఁడెంతయుసంతసించి యాకన్యకను బరిగ్రహింపవలయునని మొదట నర్జుననే ప్రార్థించెను. కాని నృత్తగీతాదులయందుఁ దానుత్తరకుగురువగుటచే నామెను బెండ్లాడినయెడల లోకము తన్నులోలాత్ముఁడని నిందించుననియు నందుచే నాకన్నియను గోడలిగాఁ గైకొనెదననియు నర్జునుఁడువాని కెఱింగించి, యామెను బెండ్లాడుటకు సమ్మతింపలేదు.

మ. హరిమేనల్లుఁడు బాహువీర్యపటు శౌ ♦ ర్యస్ఫూర్తి త్రైలోక్యమం
దరుఁడాచారపవిత్రుఁ డంచితకళా ♦ దక్షుం డుదారుండు, గా
తర సంరక్షకుఁ డార్యసమ్మతుఁడు వి ♦ ద్యావైభవోల్లాసి, య
త్యురుతేజుండు వరించుఁగాక యభిమ ♦ న్యుండీ సరోజాననన్.

అన్నివిధముల నభిమన్యుఁడుత్తరకుఁ దగినవరుఁడని చెప్పి, వాని విద్యాగుణశీలములను విరటున కెఱిగించు సందర్భమున మాత్రము తనకుమారునిగాఁగాక హరిమేనల్లునిగా నర్జునుఁడు ప్రసంగించుటెంతయు యుక్తియుక్తముగా నున్నది. అర్జునుని మాటలువిని విరటుఁడు మిక్కిలిసంతసించి, యర్జునునితో వియ్యమందుటకన్నఁ దనకు మహాభాగ్యము లేదని, యాశుభకార్యము నిశ్చయించుభారమును ధర్మజునియందుంచెను. ధర్మజుఁడును నర్జునుని యభిమతానుసారముగ నుత్తరాభిమన్యుల వివాహము తనకుఁ బరమసమ్మతమని పలికి యాశుభవార్త చుట్టాలకెల్లరకు నెఱిఁగింపవలయునని విరటుని నియోగించెను. కౌరవవంశముతో సంబంధము గల్గినందునఁ దనమాత్స్యవంశము పావనమయ్యెనని పలుకుచువిరటుఁడుకన్యారత్నమగునుత్తరచే ధర్మ భీమార్జున నకుల సహదేవులకుఁ గ్రమంబున మ్రొక్కింప, నమ్మహాపురుషులేవురును దమముద్దుకోడలిని దీవించి, యంతఃపురంబునకుఁబోవ ననుజ్ఞనొసంగిరి. పిమ్మట నుభయ పక్షముల వారును మౌహూర్తికులరావించి శుభలగ్ననిర్ణయముచేయించి, యాదవపాంచాలాదులగు తమతమ బంధుజనములకెల్ల వర్తమానములు పంపిరి.

తదనంతరమునఁ బాండుకుమారు లేవురును నజ్ఞాతవత్సరారంభమున శమీవృక్షమునందు దాచుకొనిన తమతమ యా

యుధములను దీసికొని యుపప్లావ్యపురమునకు విచ్చేసి వివాహ మునకు రానున్న తమతమ బంధువులకొఱ కెదురుచూచుచుండిరి. అట్లుండ బలరామకృష్ణులు సాత్యకితో సుభద్రాభిమన్యుల వెంటనిడుకొని, ప్రద్యుమ్నుఁడు సాంబుఁడు మొదలగుకుమారవీరులతోడను, అక్రూరాది పరివారజనముతోడను, ఇంద్రసేనాది పాండవసారథులతోడను, రథారూఢులై చతురంగబలసమేతులై యుపప్లావ్యమునకు వచ్చిరి. పాండునందనులును సంభ్రమోత్సాహములతో నాయాదవ సింహముల కెదురేగిరి. తోడనే యొకరికొకరు మ్రొక్కువారును, మ్రొక్కువారిని దీవించువారును, ఒకరినొకరు కౌఁగిలించువారును కౌఁగిలించువారినిఁ బ్రశంసించువారునునై యయ్యాదవ పాండవవీరులును హానందపరవశులైరి. పిమ్మట శ్రీకృష్ణుఁడు సుభద్రాభిమన్యుల నభ్యంతరజనముల వెంటఁ బాంచాలిహాలికింబంపి, మనోహరములగు రత్నాల భూషణములును, విలువగల వలువలును గానుకలుగాఁ గుంతీకుమారులకును బిదప ద్రౌపదికిని నొసంగెను. మఱియు వారలకుఁ గరితురగస్యందనములును, దాసదాసీజనములను వేలువేలుగ సమర్పించి, వాసుదేవుఁడు వారందరితోన అహోరాత్రములు నిమిషమాత్రములుగాఁ బుచ్చుచుండెను.

పిమ్మటఁ బాంచాలదేశాధీశ్వరుండగు ద్రుపదరాజు కుమారులతోఁగూడ మహావైభవమునవచ్చి తన జామాతలగు పాండుకుమారులకుఁ బ్రియంబుగూర్చి వారలచేనుచితగతి గౌరవింపఁబడియె. ఇంతియెకాక, యవ్వివాహ మహోత్సవమున కాహ్వానింపఁబడిన బహుదేశాధీశ్వరులగు బంధుమిత్రాదులు వచ్చి యలంకరించుటచే నుపప్లావ్యపురము నిత్యకల్యాణమును

బచ్చతోరణమునై నలకూబరుని వివాహమున కలకాపురమువలె శోభిల్లఁజొచ్చెను.

అచ్చట విరటుండును దననగరంబున నుత్సవంబుసాటించెను ప్రతిగృహమునకును రతనాల తోరణములు వ్రేలాడఁగట్టిరి. ముంగిళ్ళ రంభాస్తంభములనాటిరి. కుంకుమముతోఁ గలియనలికి కప్పురంపుఁబొడితోఁజక్కఁగముగ్గులిడిరి. మఱియుఁ బలువిధములగు నలంకరణములచే నూతనశోభవహించి, యవ్విరాటనగరము పరిణయోత్సవమును మాధవలక్ష్మి కుద్యానవనమై చూపరులకు నయనానందమొనర్పసాగెను. విరాటుఁడు, తానును సుధేష్ణయుఁ దనయులుఁ దమ్ములు బంధువులు మొదలగు వారితో గంధమాల్య నవరత్నభూషణాదుల నలంకరించుకొని, సకలశాస్త్రపారంగతులగు బ్రాహ్మణోత్తముల నుచితగతి సత్కరించుచుండెను. మఱియు ధగద్ధగాయమానములగు మణిస్తంభముల రత్నదీపములు పెట్టించి, చెలువుమిగులు చాందినీలఁగట్టించి, ముత్యాల దండలును బూలదండలును, మంగళప్రదములగు పచ్చతోరణములును వ్రేలాడించి, చందనమున నలికించి, ముత్తియముల ముగ్గువెట్టించి, విరటుఁడు కల్యాణమందిరమును నలంకరింపఁజేసెను. పురోహితుఁడును వలసిన వస్తువిశేషములనెల్లఁ గొనివచ్చి వివాహమంటపమును సిద్ధముగావించెను. ఇట్లు సర్వసన్నాహమును సంసిద్ధమయినంతనే బహువిధాభరణముల నుత్తరనలంకరింపనేర్పుగల చెలికత్తెలనియోగించి మత్స్యనాథుఁడు శిష్టజన పరివేష్టితుఁడై కూర్చుండి, లగ్నమాసన్నమయ్యెనని ధర్మజునకు వర్తమానమంపించెను.

ఆవార్త వినినతోడనే ధర్మజుఁడు తన తమ్ములతోఁ గూడుకొని. సుగుణగణాలంకారుఁడగు నభిమన్యుని మణిగణాలంకారముల నలంకరింప నియోగించి, పిదప భద్రగజారూఢుండగు నా సౌభద్రుని వెంట నేనుంగులుఁ దురంగమ్ములుఁ మణిగణమ్ములు నంబరములుఁ బుష్పములు ఫలములు మొదలగు యోగ్యవస్తువుల విస్తరిల్లిన కరింతగ నడువ నియోగించి, మంగళతూర్యనాదములును, బ్రాహ్మణాశీర్వాదములును, మాంగధ గానములును, వందిజనవాక్య సంతానములును జెలంగ వాసుదేవపురస్సరంబుగా మత్స్యనాథుని మందిరంబున కేతెంచి, శంఖ జయఘంటాది మంగళధ్వనులతో నెదుర్కొని లోనఁ బ్రవేశించెను. మత్స్యనాథుఁడు పరమసంభ్రమము వహించి యాదరమును భక్తియుఁ జూపుచు వచ్చినవారినందరిని నుచితగతిఁ గౌరవించెను. తోడనే పురోహితులును వివాహ పుణ్యకర్మల నడప నారంభించిరి. ఒండొరుల ముఖమండలములఁ జూచుకొనకుండ వధూవరులకడ్డముగఁ గట్టఁబడిన తెరయొద్ద శ్రీకృష్ణుఁడును, ధర్మజుఁడును, ధనంజయుఁడును, మత్స్యనాథుఁడును నిలువంబడిరి. మంగళతూర్యనాదములతోఁ గొన్ని నిముసములకు తెరయెత్తఁబడియె. పరస్పరరూపవిద్యాగుణశీలములఁ జిరకాలమునుండి వినుచుండుటచే నెండొరులఁ జూచుకొన నువ్విళులూరుచున్న యుత్తరాభిమన్యుల కా నిముసములు యుగములైనవి. తెరచాటు తొలఁగినంతనే హృదయములనాటిన యన్యోన్యానురాగము పొంగ నవ్వధూవరులు నునుసిగ్గుపెంపునఁ జూచియుఁ జూడనిట్టు లొండొరులఁ జూచుకొనిరి.

పిదపఁ జుట్టునఁగులిఁగూడిన చుట్టములెల్లరు మిక్కిలి మెచ్చుటపాటునఁ జూచుచుండ మందారకల్పలత లొండొంటిపైఁ బూలవాన గురియునట్లు దోసిళులతో నుత్తరాభిమన్యు లొండొరులపైఁ దలఁబ్రాలువోసికొనిరి. నాటి శుభలగ్నమున సౌభద్రుఁడు నిజబాహు తుండమున నయ్యుత్తరపాణిపల్లవమును గ్రహించి యర్జునాదులకు నయనానందమొనఁ గూర్చెను. బంధువులెల్లరు నవ్వధూవరుల నేకాసనమునఁ గూర్చుండఁబెట్టి ఈ నూతనసౌభాగ్యమున కెంతయు వేడుకపడఁజొచ్చిరి. అట్లేకాసనాసీనులగు నయ్యుత్తరాభిమన్యు లిరువురు నొక్కపాదునఁ బెరిగిన విరజాజి మావిఁడిమొక్కలవలె మిక్కిలి ప్రకాశించిరి. ఇట్లు వివాహమహోత్సవము శుభప్రదంబుగఁ గొనసాగినంతనే విరటుండు, మణిభూషణములును, విలువగలవస్త్రములును, కర్పూరాది సుగంధద్రవ్యములును, తాంబూలములును దెప్పించి శ్రీకృష్ణసహితులయిన పాండవులకును, వారిపురోహితులకును గూడ సమర్పించెను. ఇంతియెకాక, తగినవస్త్రాభరణాదులనంతఃపురజనముచే ద్రౌపదీసుభద్రలకుఁబంపించి, యభిమన్యునకు సుప్రసిద్ధములగు పదివేలగుఱ్ఱములను, సలక్షణములగు నైదులక్షలగోవులను, రెండువేల రథంబులను, అనేక భద్రసామజములను, లక్ష దాసదాసీజనమును మత్స్యభూరమణుఁ డరణముగా నొసంగెను. వివాహములయందిట్టి కట్నముల యాచారములు సనాతములేగాని యధునాతనములుగావు. ఆదిలో నీయాచారములు కేవలము వేడుకలు. నానాటికి నీవేడుకలే వాడుకలయినవి. ఈవాడుకలు లగ్నకాలమందలి మంత్రములవలె విధివిధానములై నిరుపేదలగు కన్యాదాతల నేడెంత బాధింపుచున్నవి!

ఆహా! పుట్టినదాఁకుబిడ్డయును పురిటింటివార్త తండ్రి చెవులకు
గొడ్డలి పెట్టునలెఁ దోఁపించు నీయాచారము యుగములు మారిన
ను మారకుండుట సంఘదౌర్బల్యమునఁగదా !

విరాటుఁడొసంగిన కట్నములతో నవ్వివాహమహోత్స
వము పూర్తియైనది. కాని తద్వివాహప్రసంగమును బూర్తి
చేయుటకు మనకింకను వీలులేదు. బలరామునకు శశిరేఖయను
నొకకూఁతురు కలదఁట. ఆకన్యకను దుర్యోధనకుమారుఁడగు
లక్ష్మణునకొసఁగవలయునని యతఁడునిశ్చయించెనఁట. అందు
కు సుభద్రయెంతయు వగచి శశిరేఖ నభిమన్యునకొసంగుమని
యన్ననెంతప్రార్థించినను నతఁడు సమ్మతింపక, యుండనూ
రును దినఁదిండియులేక యడవులపాలయిన యర్జునునితోఁ దా
నట్టి సంబంధము గలిగించుకొనననని విస్పష్టముగఁ బ్రత్యుత్తర
మొసంగెనఁట. అందుపై సుభద్రాభిమన్యులిరువురు బలరాము
నిపై రోషమువహించి యచ్చటనుండనొల్లక ద్వారకవిడిచి య
ర్జునునొద్దకు బయలుదేరిరఁట. అట్లు బయలుదేరి వారొక యర
ణ్యమార్గమునఁబోవుచుండ భీముని కుమారుఁడైన ఘటోత్క
చుఁడు వారలనడ్డగించి వారికిని దనకునుగల బాంధవ్యమునెఱుం
గక తాను నరమాంసభక్షకుఁడగు రాక్షసుఁడగుటచేఁ దనయర
ణ్యమునఁ బ్రవేశించినవారి నిరువురను భక్షించుట కుద్యమించె
నఁట. ఆసందర్భమున వీరాగ్రేసరులగు నభిమన్యు ఘటోత్కచు
లకిరువురకును ఘోరసంగ్రామము జరిగినదఁట. యుద్ధమ్మంజగు
గుచుండఁ గల్పితకథలకు మూలపురుషుఁడగు నారదుఁడు ప్రత్య
క్షమై వారిరువురను వారించి వారికిఁగల పరస్పర బాంధవ్యము

నెతింగించెనఁట. పిమ్మట ఘటోత్కచుఁడు సుభద్రాభిమన్యుల వృత్తాంతమును దెలిసికొని యతివేగముగ ద్వారకానగరమునకేగి, యంతఃపురమున నభిమన్యునికొరకుఁ బరితపించుచు దుఃఖాతిశయమున స్మృతిలేక పడియుండిన శశిరేఖను దనమాయాబలమున మంచముతోడనే పరులకంటఁబడకుండఁ గొనివచ్చి సుభద్రాభిమన్యుల కప్పగించి, తానుమరల నచ్చటికేగి మాయశశిరేఖయై పరివర్తింపఁజొచ్చెనఁట. వివాహకాలమున లక్ష్మణునకీమాయశశిరేఖ యొకప్పుడు బెబ్బులివలెను నింకొకప్పుడు త్రాచుపామువలెను మరియొకప్పుడు పెనుభూతమువలెను గనఁబడుచుండుటచేఁ బెండ్లికుమారుఁడు భయపడి తనకీకన్యకవలదని పరుగిడఁదొడంగెనట. పెండ్లికుమారునేకాక పెండ్లిపెద్దలను, పెండ్లికివచ్చిన బంధువులు మొదలగువారినందరినిగూడ నిట్లనేకవిధముల ఘటోత్కచుఁడు భయమొందించి, చీకాకుగల్గించి పిచ్చెత్తించి తుట్టతుదకు భయంకర కంఠస్వరముతో నభిమన్యునకుఁగాని శశిరేఖ పెండ్లికై తగుదుమనివచ్చిన మీయందరికీప్రాయశ్చిత్తము చాలుననియు, శశిరేఖాభిమన్యులకు వివాహముజరుగనున్నదికావున, నిజమైన శశిరేఖపెండ్లి చూడవలయు నన్నమీరందరును ఘటోత్కచుని వనమునకు రావచ్చుననియుఁజెప్పి మాయమయ్యెనఁట. పిమ్మటనదంతయు ఘటోత్కచునిమాయయేయని గ్రహించి బలరామాదులు పశ్చాత్తాపమొంది, యయ్యరణ్యమునకేగి శశిరేఖాభిమన్యుల వివాహోత్సవము మహోత్సాహమునఁ గావించిరట.

పైనివివరించిన చిత్రకథ మనయాంధ్రదేశమున మిక్కిలి ప్రచారములోనున్నది. గ్రంథాధారములేని యీ చిత్రకథ

బలరామునకుఁగల దుర్యోధన పక్షపాతమును ఘటోత్కచునకుఁగల మాయాబలకౌశల్యమును; అభిమన్యునకుఁగల ధనుర్విద్యాపాండిత్యమును బ్రకటించుటకుఁ గల్పింపఁబడియుండుననిమా యూహ.

## — యుద్ధరంగమందలి యభిమన్యుఁడు —

ఉత్తరను జేపట్టినతరువాత మహాభారతయుద్ధము ప్రారంభించువరకు నభిమన్యుని జీవితమున మనము ప్రసంగింపనలసిన ముఖ్యాంశములేమియును లేవు. తనయుద్ధాంగలక్ష్మితోనా కుమారవీరుఁ డతిస్వల్పకాలము మాత్రమే సంసారసౌఖ్యముల ననుభవించి, తనతండ్రులకు దాయాదులతో రాజకీయసంగ్రామము తటస్థించుటచేఁ దానును దుష్టసంహారమునిమిత్తమవతరించిన మహావిష్ణువువలె ధనుర్ధరుఁడై కురుక్షేత్రమునఁ బ్రవేశించెను. అభిమన్యుని వివాహమైన యైదవనాటనుండియు దాయభాగమునుగూర్చిన రాజకీయాంశములు చర్చింపఁబడ నారంభించినవి. పెండ్లికయివచ్చిన నానా దేశాధీశ్వరులును గూర్చుండియుండ నిండుకొలువున శ్రీకృష్ణుఁడీయంశమును జర్చించి పాండునందనులుపడిన కష్టములును, ధర్మాచరణమునందలి వారిపట్టుదలయు నెల్లరహృదయముల గాఢముగ నాటించెను. అందుపై నచ్చటిరాజవీరులెల్లరు వివాహోత్సవముతోఁబాటుగనాహవోత్సవముఁగూడ వహించి సమయమువచ్చినప్పుడు పాండవులకుఁ దమతమ సైన్యములతోఁ దోడ్పడ సంసిద్ధులైరి. అందుచేతనే యజ్ఞాతవాసాంతమున జరిగిన యీవివాహమట్లు దైవికమేయయ్యు రాజకీయముగాఁ బాండవులకు ఫలించినది.

పాండునందనులు శ్రీకృష్ణుని ముందిడుకొని తమకున్యాయముగ రావలసిన దాయభాగమునుగూర్చి పలువిధములఁ బ్రయత్నించిరి. రాయబారములంపిరి. తుట్టతుదకుఁ దమకైదువురకునై దూళ్ళిచ్చినను జాలుననియు, సకలవిధముల సంధికై ప్రయత్నింపవలయుననియుఁ జెప్పి ధర్మజుఁడు శ్రీకృష్ణుని బంపించెను. కాని యెన్నివిధములఁ బ్రయత్నించినను దుర్యోధనుఁడు సంధికంగీకరింపలేదు. నిండుకొలువున మాధవుఁడొనర్చిన హితోపదేశమును, భీష్మాది కురుపుంగవుల నీతివాక్యములును, నారదకాణ్వాది మహామునుల యితిహాసోపన్యాసములును దుర్యోధనునెడఁ గేవలమును నిష్ఫలము లయినవి. అందుపై మాధవుండచ్చటి వ్యవహారమును దుదముట్ట సవరించుకొని యుద్ధ నిశ్చయముగావించుకొని తిరిగి యుపప్లావ్యమునకు విచ్చేసెను. అదివరకే సర్వసమరసన్నాహమును సమకూర్చుకొనిన పాండునందనులు కృష్ణునివలనఁ గౌరవసభయందలి విశేషములన్నియువిని మరింతరణోత్సాహమును వహించిరి. పిదప నుభయపక్షములవారును దమతమసైన్యములతోఁ గురుక్షేత్రమునఁ బ్రవేశించిరి. పుణ్యదినంబగునమవసనాటియుదయమ్మునమహాభారతయుద్ధము ప్రారంభింపఁబడినది. పాండవులయేడక్షౌహిణులబలమ్మునకు ద్రౌపదిసోదరుండయినధృష్టద్యుమ్నుండును, కౌరవులపదునొకండక్షౌహిణులకును భీష్ముఁడునునాయకులుగానియమింపఁబడిరి.

యుద్ధమారంభింపఁ బడిననాఁడు పాండవు లచలమను పేరుగల యొకమహావ్యూహమును బన్నిరి. ఆవ్యూహమునకు నాయకుండయిన ధృష్టద్యుమ్నుఁడగ్రభాగంబున నిలిచి, భీమసేనాది మహావీరులను గొందరిని దనకుఁదోడుగానుంచుకొనియె.

వారలలో బాలభటవీరుండగు మనయభిమన్యుఁడుముఖ్యుఁడు.
నాటియుద్ధమునఁ గోసలదేశాధీశ్వరుఁడగు బృహద్బలుం డభిమ
న్యునిదాకి వానిసారథినిగూల్చి, హయములఁ బడనేసెను. తో
డనే యక్కుమారవీరుఁడు మహోగ్రాకారుఁడై తానును న
ట్టులే యాబృహద్బలుని సారథిని రథ్యముల నేలఁగూల్చి, యం
తతో విడువక, వాని కేతనమ్మును బడనేసి, చేతంగలవిల్లుద్రుం
చి, శరపూరితగాత్రునిగా నొనర్చెను. కౌరవసైన్యాధీశ్వరుండ
గు భీష్ముఁడు దుర్యోధనప్రేరితుఁడై, పాండవబలముపై విజృం
భించి, చేదిపాంచాలకేకయాది, రాజవీరులసేనల నిమిషమాత్ర
మునఁ జీకాకుపరచి, మొత్తముపైఁ బాండవబలమును నేలఁబొ
రలాడు తలలతోడను, తునియలయిపడిన విండ్లతోడను, నేల
వ్రాలిన కళేబరములతోడను, విరిగిపోయిన పతాకములతోడ
ను, రక్తప్రవాహములతోడను, పూర్తిగ నింపివేసెను. ఇట్లు
ప్రళయకాల రుద్రునివలె విజృంభించిన భీష్మునిమార్కొను మ
గలులేక, పాండవసైన్యము చీకాకుపడుచుండ, నభిమన్యు కు
మారుఁడభయమొసంగి, బంగారురంగుతురంగముల యంగము
లకాంతులును, కర్ణికారధ్వజము కాంతులును దిక్కులవ్యాపిం
ప, భయంకరాకారముతో గంగానందను నెదుర్కొనియె. నిర్జ
రసైన్యాధీశ్వరుండగు కుమారదేవునివలె నర్జునకుమారుఁడు ని
ర్భయముగఁ జెలరేగి, ఐదుబాణమ్ములు శల్యుని శల్యముల
నాటించి, యొక్కశరమ్మునఁ గృతవర్మ యురమునుబగిల్చి, నా
లుగుకోలలతోఁ గృపునిహయముల నేలఁగూల్చి, మఱియుఁ
దనకడ్డమైనిలిచిన దుర్ముఖాదుల దూరముగఁదోలి, కట్టకడకుభీ
ష్మునిపైఁబడియెను. అట్లా ముద్దులమనుమఁడుతనతాతనుదాకి,

తన ధనుర్విద్యా పాండిత్యమును వానికి మచ్చుచూపుచు, వాడిగల తొమ్మిదమ్ముల వానిమేన నాటనేసి, యేమిచేయుటకును దోఁపనీయక వానికిమిక్కిలి తత్తరపాటుగల్గించెను. ఒక్క క్షణములో నాతఁడు ప్రకటించిన యాసంగర కౌశల్యమును దేవతలెల్ల వేనోళ్ళఁగొనియాడిరి. భీష్మాదివీరులును "భళిరా! వీఁడు వివ్వచ్చును బోలవచ్చు. మెచ్చుగావచ్చు. కాని లేశమునుదీసిపోఁడు" అనియెంతయు మెచ్చఁజొచ్చిరి.

అట్లుమెచ్చి గంగానందనుఁ డర్జునకుమారుని సారథిని గేతనమును నారమ్ములఁబడనేసి,వానిపైఁబలువిధములగు నుజ్వలాస్త్రములఁ బ్రయోగించెను.అంతియెకాక,వానికిఁదోడుగశల్యకృపకృతవర్మాదులుఁగూడఁ జెలరేగి, యొక్కమొగినభిమన్యునిపై నఖండబాణవర్షమును వర్షింపనారంభించిరి.ఆబాణవర్షములనుమహాపర్వతమువలె సహించి, యాబాలుఁ డుగ్రాకారుఁడై యవీరాగ్రేసరుల నందరినినిశాతశరపరంపరలమిక్కిలినొప్పించి,చీకాకుపరచి,కడుఁజాకచక్యముతో నత్యద్భుతముగ భీష్మునితాలధ్వజమును నేలపైఁ గూలనేసెను.పతాకముగూలుటకన్న వీరునకుఁబరాభవములేదుగదా ! అట్లు తాలధ్వజమువిఱిగి నేల వ్రాలినంత నే పాండవసైన్యము లన్నియు మహానందముతోనొక్కపెట్టుననార్చెను. కౌరవసేన చిన్నఁబోయెను. ఆహా! భీష్మశల్యకృపకృతవర్మాది మహాయోధుల నెల్లఁదానొక్కఁడవారించిపోరాడఁగల్గిన ధనంజయకుమారునిశస్త్రాస్త్రకౌశలమెంతనికొనియాడఁగలము? కౌరవసేనాసముద్రమునకుఁ జెలియలికట్టయి, భీష్మాదియోధుల విజృంభణ మణఁచిన యభిమన్యుని బాహువిక్రమమును బాండవసేనలు పలువిధములఁ గొనియాడఁ దొడంగెను.

రెండవనాఁటి యుద్ధమ్మునఁ బాండవులు క్రౌంచవ్యూహమునుబన్నిరి. ఆవ్యూహమునకు భీమసేన ధృష్టద్యుమ్ను లిరువురును బలువురు వీరులను దమకుఁదోడుగా నునిచికొని దక్షిణవామపక్షంబుల నిలిచిరి. అందు భీమునకుఁ దోడుగానిలిచినవీరులలో నభిమన్యుఁడు ముఖ్యుఁడు. ఆనాఁడ భిమన్యునకును దుర్యోధనకుమారుఁడగు లక్ష్మణునకును బోరాటము తటస్థించెను. ధృష్టద్యుమ్నుం డశ్వత్థామతోఁబోరుచు, నాతని రథ్యంబులఁ గూల్ప, శల్యుఁడును గృపుఁడును వానికిఁదోడై పాండవసేనాని నెదిరించిరి. అట్లు శల్యకృపాశ్వత్థామలు మువ్వురునేకమై ధృష్టద్యుమ్నుని జుట్టుముట్టుట దూరమునుండి యభిమన్యుఁడు చూచి, వాయువేగమ్మునఁ దనరథమ్మునుదోలించుకొనివచ్చి, వచ్చినతోడనే కృపాశ్వత్థామలనిరువురఁ దొమ్మిదేసియమ్ముల గాఢముగనొప్పించి, శల్యునిశరీరము నిరువదియైదుబాణముల జల్లిడ నలెఁగావించెను. అదిచూచి లక్ష్మణుఁడు వారికిఁదోడుగాఁ బరుగుపరుగునవచ్చి సౌభద్రునిదాకి, మర్మభేదులయిన తీవ్రశరములచే నాతని మేనెంతయు నొప్పించెను. అభిమన్యుఁడును నిశాతశరవర్షము వానిపైఁగురియించి తనహస్తలాఘవము నించుక ప్రకటించెను. అందుపై లక్ష్మణుండమోఘమగు బాణప్రయోగమున నభిమన్యుని విల్లుద్రుంచి పెద్దపెట్టున నార్చెను. వాని పరాక్రమమును మెచ్చి కౌరవసేనయు విజయారావము నర్పఁగడంగెను. కాని విజయాత్మజుఁ డవ్విజయారావమ్ములకు భీతిల్లక, యొండొకవిల్లందుకొని లక్ష్మణుని విజయాసక్తి సంపూర్ణముగ నడఁచెను. తోడనే తనతనయుని దీనావస్థ నరసి, దుర్యోధనుఁడు సత్వరముగఁదనరథము నభిమన్యునిపయికిఁ దోలిం

చెను. సౌభద్రునిబాహువిక్రమసంపదనెఱింగినవారగుటవానివలన రారాజున కెట్టియుపద్రవము గలుగునోయని వానికిఁ దోడుగ భీష్మద్రోణాది మహావీరులెల్లరువచ్చి యాకుమారవీరుని పయిఁబడిరి. అమ్మహాపద్రవమునకు సుభద్రకొడుకు లేశమునుజలింపక చిరునవ్వుతో నందరికన్నిరూపులయి యాధనురాచార్యపుంగవులతో రణక్రీడనాచరించి, యంగములనొప్పించి యంతరంగముల మెప్పించెను.

మూఁడవనాటి యర్థచంద్రవ్యూహమ్మునభిమన్యుఁడు సాత్యకిసమేతుఁడై యలంకరించి, తనతండ్రులకుఁ బరమశత్రువయిన శకుని నెదిరింపనారంభించెను. సాత్యకియు గాంధారసైన్యముల ననేకగతుల నిర్మూలముగావించుచుండ, శకునివానిపైవిజృంభించి, యాతనిరథంబును ఖండించి విరథునిఁ జేసెను. తోడనే యభిమన్యుఁడు తనమామను రథంబెక్కించుకొని, వానితోఁగూడ గాంధారసేనాసముద్రము నెదురీదుచు, తన్నడ్డగించిన యనేకవీరాగ్రేసరుల నోడించి పారఁదోలెను. శకునియు నాకుమారవీరునిధాటికి నిలువలేక తనసేనలతోఁ బారిపోయెను. ఆవార్తవిని దుర్యోధనుండు తన బంధువులతోఁ గూడ నెంతయుఁ దల్లడిల్లఁజొచ్చెను.

ఆనాటిసంగరమున రారాజునకుఁ బరాజయము గలుగుటచే నమ్మరునాడు గాంగేయుఁడు లయకాలరుద్రుఁడై పాండవసైన్యములపైఁ జెలరేఁగి, తాలధ్వజకాంతులు దిక్కులఁబిక్కటిల్ల మున్ముందుగఁ దనరథము నర్జునునిపైకిఁ దోలించెను. వానికిఁదోడుగ ద్రోణుండును, దుర్యోధనుఁడును వింశతియుఁ గృపుఁడును సోమదత్తుఁడును శల్యుఁడును నర్జునునిపైఁ బడిరి.

అదంతయుఁజూచి, యభిమన్యుకుమారుఁడుతనరథమును వాయువేగమునఁ దోలించుకొనివచ్చి, వేలుపులు మేలుమేలనునట్లు లయ్యేడ్వురనొక్కమారెదిరించి నిల్చెను. భీష్మద్రోణకృపాది మహావీరుల తీవ్రబాణపరంపరలఁ దనధనుర్విద్యాకౌశలమున వారించుచు, నారణాంగణవేదికపై సౌభద్రుఁడగ్నిహోత్రునివలెఁ బ్రకాశించుచుండెను. వానిసాహసమునకు భీష్ముఁడు లోలోన నవ్వుకొనుచు, వానినివిడిచి, తనచూపులును దూపులునుగూడ నర్జునునిపైకిఁ ద్రిప్పుకొనియెను. కాని యంతమాత్రమున మనయభిమన్యునకు విశ్రామము కలుగ లేదు. భీష్ముఁడు వానిని దాటిపోయినంతనే, యశ్వద్ధామ భూరిశ్రవశ్శల్యపుత్ర చిత్రసేనులు కోదమసింగమునుదాకు మదపుటేనుంగులవలె వాకుమారసింహుని జుట్టుముట్టిరి. అహా! యుద్ధముక్రౌర్యబద్ధముగదా? యుక్తాయుక్తములరయక యందరుమహావీరులొక్క బాలకునెదిరించుటెంతటి సాహసము ! అట్టులొక్క మొగిని దన్నుఁజుట్టుముట్టిన వీరపుంగవుల నెల్లరఁ దేరిపారఁజూచి కవ్వడికొడుకు చిఱునవ్వునవ్వుచు గురుపుత్రునియురమునొవ్వనేసి, శల్యపుత్రుని పతాకమును ఖండించి తక్కటివారింగూడ నక్షయబాణపరంపరల మిక్కిలి తహతహలాడించెను. అక్కురువీరులెల్లను నక్కుమారవీరుని పరాక్రమానలము సహింపలేక, యట్లు తహతహలాడుచుండ, గంగానందనున కంగరక్షకులై నిలిచిన దుర్యోధనాదులార్వునుగూడ నశ్వత్థామాదులకుఁ దోడుగవచ్చి యభిమన్యునకు మరింత రణోత్సాహమును గలిగించిరి. అట్లు తన్నెదిరించిన యశ్వత్థామభూరిశ్రవశ్శల్యపుత్ర చిత్రసేనులతోడను వారికిఁ దోడుగనిలిచిన గురుకృపశల్యదుర్యోధన సోమదత్త వింశ

తులతోడను బోరాడుచుఁ గ్రీడికొడుకు తనరణక్రీడాపాటవము ను, నిరుపమాన బాహువిక్రమమును, మహాధైర్యశౌర్యములు ను, బూర్తిఁగ వెల్లడించి మూర్తీభవించిన ధనుర్వేదమువలెఁ దోఁచుచు వారందరిని నిశ్చేష్టితులఁగావించెను అందరుమహా వీరులతోఁ దానొక్కఁడె వెనుదీయక ఘోరముగఁ బోరాడుచుం డిన తనముద్దుల యభిమన్యునిగాంచినంతనే నాడర్జునుఁడెంతసం తసించెనో యెవరు వర్ణింపఁగలరు ?

ఆనాడటు పేరెక్కిన యమ్మేటిమగలెల్లరు నభిమన్యుని పరాక్రమానలమును సహించి నిలువఁజాలకపోవుటచే రారాజు మిక్కిలి కటకటపడి యభిమన్యు నంతతోఁబోనీయక వానిపైకిఁ ద్రిగర్తలను గృతవర్మను గేకయులను ముప్పదైదువేల రథం బులవారిని మరలఁబంపెను. అల్లు రెక్కపుర్వులవలె లెక్క కువిగారిన మహాసైన్యములనెల్లఁ ద్రోలఁగద్రోయుచు రణవ్యా పారనిమగ్నుఁడై యుండిన యభిమన్యుఁడు నాడాకస్మికముగ ధృ ష్టద్యుమ్ననకుఁ దోడుపడవలసివచ్చెను. ధృష్టద్యుమ్నుఁడు తి న్నదిరించిన శల్యనందనునితోఁ బోరాడి వానిసిగడతేర్చుటచేత శల్యుఁడు రోషభీషణాకారుఁడై వానిపైఁబడి యతని కోదండ మునుఖండించి వాడితూపుల మేనెల్ల జల్లిడవలెఁగావించి యెంత యుబాధించుచుండ, నభిమన్యుఁడు చక్రరక్షకునివలె వానికి సా క్షాత్కరించి, యమ్మహాప్రసతిందాక వానివిజృంభణమంతయు నవలీలనణంచెను. శల్యుని ప్రతాపము నీరసించినంతనేదుర్యో ధనుఁడు తత్తరపడి దుర్ముఖుని దుస్సహుని దుర్మర్షణుని సత్యవ్ర తుని జిత్రసేనుని బుకుమిత్రుని వివింశతిని వికర్ణుని నొక్కమా రుగ సౌభద్రుని మార్కొన నియోగించెను. సుభద్రకొడుకు

వారందరినిదాఁకి తద్బాహుగర్వమును భంజించుచుండ వేరొక టక్కున భీమసేనుండుగ్రాకారుఁడై నేటితోడనే భారతయుద్ధము ను బూర్తిఁ జేసెదనని చెలరేఁగి కౌరవసేనల ఛేదింపఁజొచ్చెను. వానిభయంకర బాహువిక్రమమునకు దుర్యోధనానుజులందరు ను భీతిల్లినలువంకలకుఁ బారిపోవుచుండ దుర్యోధనుఁడించుక ధైర్య మువహించి మగధదేశాధీశ్వరునిభీమసేనునెదిరింపనాజ్ఞాపించెను.

భయంకరములగు ననేక మత్తమాతంగ సంఘముల తో మాగధుఁడు విజృంభించి వృకోదరుని మార్కొనినంతనే యభిమన్యుఁడు ధృష్టద్యుమ్నాదుల వెంటనిడుకొని వానికిఁదో డుగనేగి, మాగధుని యేనుంగులఁ బీనుంగులఁ గావింపఁదొడం గెను. మగధేశ్వరుండది సహింపనేరక సౌభద్రునిపైకొక దుష్ట గజమును బురికొల్పెను. భీష్మాది మహాయోధులఁ దహతహ లాడించిన యాకుమారవీరునకొక గజంబన్న నేమిలెక్క ? ఆమ దపుటేనుఁగు తనపై విజృంభించినంతనే యారాచసింగము దా నికుంభము వ్రయ్యలొనర్చి నేలఁగూల్చియంతతోవిడువకయా యేనుంగుతోడనే మాగధునిఁగూడ నెత్తుటివరదలతో రణభూ మినలంకరింపఁ జేసెను. మాగధుఁడు కూలినంతనే భీమసేనాదు లాసౌభద్రుని సాహాయ్యమ్మున హతశేషములయిన మదవార ణములఁ గడతేర్చి యయ్యేనుఁగుల పీనుఁగులను గొండలవలెఁ బేర్చిరి. ఇట్లనేకవిధమ్ముల దుర్యోధనుని ప్రోత్సాహమునఁ దద న్నెదిరించుచువచ్చిన మహావీరుల వందలకొలఁది వారించుచు ఆపత్సమయముల ధృష్టద్యుమ్న భీమసేనాదులకుఁ దోడ్పడుచు నభిమన్యుఁడు నాటియుద్ధమునఁ గమలాకరమునందు మదపుటే నుఁగువలెఁ గౌరవసైన్యమున సంచరించెను.

ఐదవనాఁడు యథాప్రకారముగ మరల భీష్మార్జునులు ఘోరముగఁ బోరఁదొడంగిరి. అసమాన శౌర్యసముద్రుండును లోకైకవిక్రముండునగు గాంగేయునితోఁ బోరాడుచుండిన తనతమ్మునకుఁ దోడ్పడవలయునని భీమసేనుఁడు తనరథము నావంకకుఁ దోలించెను. అదికనిపెట్టి వానిసహాయ్యము లేశమయిన నర్జునునకుఁగాకుండ దుర్యోధనుఁ డడ్డగించి, నిశాతశర వ్రాతముల నాతని మేనెంతయు నొప్పించెను. తోడనే భీముఁడు భీషణాకారుఁడై రారాజు శరీరం బెల్లఁ జితుకనేసి, వానిని బ్రాణమాత్రావశిష్టునిగా నొనర్చెను. అందుచే భీమునివలన రారాజున కెట్టికీడు సంభవించునోయను భయమున భీష్ముఁడును జిత్రసేనుఁడును బురుమిత్రుఁడును గురుపతికిఁదోడై, భీముని పైఁబడ నుద్యమించుచుండ, వారితోడ్పాటు దుర్యోధనునకందకుండ నభిమన్యుఁ డామువ్వురి నడ్డగించి, యుజ్వలబాణపరంపరలఁ దత్తర మొందింపసాగెను. అప్పుడు గాంగేయుఁడు వానిపై విసిగి కనులెఱ్ఱఁ జేసి, పసిబాలుఁడును దనకుముద్దులమనుమఁడునను మాట మరచి, మహావీరులపై విడువఁదగిన క్రూరాస్త్రము లాకుమార వీరునిపై విడిచెను. కాని యభిమన్యుఁడా గాంగేయుని మార్గణగణమ్ముల మార్గమధ్యముననే ఖండించి, చిత్రసేనుని కేలంగల శరాసనమ్మును దూలించి, వాహనముల నేలఁగూల్చి, కవచమును జీల్చి, వాడితూపుల మేనఁగ్రుచ్చి తనబాహువిక్రమమును బ్రకటింపుచుండెను. అదిచూచి క్రోధారుణితవదనులయి చుట్టుప్రక్కలనున్న రాజవీరులు గుంపులుగుంపులుగావచ్చి సౌభద్రుని ముట్టడించిరి. తనపై నఖండ

ముగవర్షించు తద్ఘనశరధారలనెల్ల ఘనశరధారలనోర్చు మహా
పర్వతమువలెనోర్చి, మంచువేసంగి నిశుష్క కాననమును దహిం
చు దావాగ్నిగతిఁ బ్రజ్వలించుచు ధనంజయనందనుఁడు శిఖిశి
ఖాసమానములగు శిలీముఖముల నారాజచక్రమునుగప్పి, యా
తఁడు పార్థుఁడా సౌభద్రుఁడాయను సంశయమునుగలిగించెను.
లయకాలమునఁ దాండవించు చండీశ్వరుని భంగి, నాటిసంగర
మున వీరనృత్యము సేయు నభిమన్యుకుమారుని పోరు భరింపలే
క, యచ్చటిరాజవీరులెల్లరు వానిని మేలుమేలని కొనియాడుచు
వెనుకకుమరలి తమగౌరవముల నంతతోఁగాపాడుకొనిరి.

తదనంతరమున, నిట్లు కౌరవసేనలనెల్ల నిరాయాసము
గ నల్లకల్లోలము గావించుచుండిన యర్జునకుమారుని శుభల
క్షణుండగు లక్ష్మణుండెదుర్కొనియె. ఇదివరకొకమా రభిమ
న్యుని బాహువిక్రమమును జవిచూచియు, రోషోద్రేకమున
నాతండతనిఁ దలపడి బహువిధములగు తీవ్రశరముల వానిశరీ
రమునుగప్పివేసెను. అంతవరకును భీష్మాదిమహావీరులతో ఘో
రసంగరమొనర్చిన సౌభద్రుఁడు, తనకిప్పుడించుక విశ్రామ
ముగల్గినదని సంతసించుచు, లక్ష్మణకుమారునితోఁ జిఱుకయ్యా
పుటాటలాడఁగడంగి, యొక్క వాఁడియమ్ము వానియురమ్మున గా
ఢమ్ముగ నాటించెను. అంతతో నాతఁడు తొలఁగిచనక, మరల
నసంఖ్యములయిన దృఢశరమ్ముల వానిపైఁబ్రయోగింప, సుభ
ద్రకొడుకించుక యాగ్రహించి, తొల్త వానివాహనములరూ
పుమాపి, సారథినిఁగూలనేసి విరథునిజేయ, నవ్విరథత్వమ్మును ల
క్షింపక, లక్ష్మణుఁడొక్క మహాశక్తి నభిమన్యునిపై విడిచెను.
అంతవరకుఁ జిఱుకయ్యమాగుచుండిన యభిమన్యుఁ డమ్మహాశ

క్తి నతిసూక్ష్మముగఁ ద్రుంచి, లక్ష్మణునిపైఁ గను లెఱ్ఱఁ జేసినంతనే చెంత నేయున్న కృపుఁడు తటాలున వచ్చి వానిని దనరథం బెక్కించుకొని యావలికిం గొనిపోయెను.

ఆమరునాఁడుఁ గూడ నభిమన్యుఁడు తొలినాటివలెనే కౌరవసేనపై విజృంభించి, ధృష్టద్యుమ్న భీమసేనాదులకుఁ గుడిభుజమువలెఁ దోడ్పడుచుఁ గట్టకడకు సైంధవుం దలపడియెను. ద్రౌపదేయులును కేకయులును వానికిఁ దోడుగ నిలిచిరి. సైంధవునకుఁ జిత్రసేనుండును జిత్రుండును జిత్రాక్షుండును జారుచిత్రుండును సులోచనుండును నందుఁడును నుపనందుఁడును దోడయి రౌద్రాకారులై సౌభద్రుం బొదివిరి. తోడనే అభిమన్యుండయిదేసి యమ్ములతో వారందఱిని వేర్వేఱుగ నాహ్వానింప, సైంధవాదులు తీవ్రాస్త్రపరంపరల నాతని ముంచిరి. వారికిఁ దోడుగ వికర్ణుండును నభిమన్యునిపైఁ గవిసెను. అవ్వికర్ణునకు సాహాయ్యముగఁ గురుకుమారులు చెలరేగిరి. ఆకోలాహలమును జూచి సౌభద్రుఁడు చిఱునవ్వునవ్వుచు, నత్యావశ్యకరమగు సంగర వ్యాపార మింకొకటి తనకు లేనందున సాయంకాలము వఱకు వారితోడనే కాలక్షేపమొనర్చెను.

ఏడవనాటిసంగరంబునఁ బాండవయోధులు రణరంగము నలంకరించి, వారి వారికిం దగిన ప్రతివీరుల నెదుర్కొని పోరాడుచుండ, నభిమన్యుఁడు దుశ్శాసన వికర్ణ చిత్రసేనుల నెంచుకొని వారల మార్కొనియెను. ఇదివరకు సౌభద్రునిచేఁ బలుమారులు పరాభవింపఁబడిన కారణమునఁ జిత్రసేన వికర్ణులు రోషభీషణాకారులై దుశ్శాసను సాహాయ్యమున వానిపైఁ బగదీర్చుకొన నెంచి, యగ్నిజ్వాలలఁ గ్రక్కు తీవ్రాస్త్రజాలముల నా

కుమారవీరుని ముంచిరి. అయ్యస్త్రపరంపరల నర్జునకుమారుఁడు కడునేర్పున ఖండించి, కవచమ్ములుచీల్చి, కార్ముకమ్ములఁదుంచి, కేతనములుగూల్చి, చేతనములడంచి, రథ్యముల నేలవ్రాల్చి, రథములఁగడతేర్చి, యవ్విరథుల నిరాధారులనొనర్చుటయెకాక, పతివ్రతామతల్లియగు తనతల్లినీ బాంచాలిని బరాభవించిన దురాచారుండగు దుశ్శాసను కంఠమునుగుఱించి శరాసనం బెత్తి, తీవ్రనారాచంబుహత్తించి, యింతలో నాకస్మికముగ భీమసేనుని ప్రతిజ్ఞ తనకు జ్ఞప్తికివచ్చుటచే, నాకుమారవిక్రముఁడు తనయెత్తినధనువు నెత్తినట్టులె దించివేసెను. ఇట్లు వలలోఁజిక్కిన పక్షులవలెఁగిరీటిపట్టికిం జిక్కిన దుస్ససేనాదుల దురవస్థనఁగసి, గాంగేయుఁడు బిరబిరఁ దనయరదంబు న్నరసందనుపైఁ దోలించి వానిందాకెను. శాంతనవుండు దాకినంతనే తత్ప్రాంతస్థులైనభూకాంతులెల్లరు దురంతాగ్రహస్వాంతులై యభిమన్యుని ముట్టడించిరి. ఇట్లు భీష్మపురస్సరంబుగఁ దన్నుఁ జుట్టుముట్టిన రాజచక్రంబునీక్షించి, యనక్రపరాక్రమంబున విజృంభించి, యవ్వీర నికాయమును భీభత్సము గావించుచుండ నయ్యభిమన్యుకుమారుఁజూచి, యర్జునుఁడు నిర్భరానందభరితుఁడై "బావా! ముల్లోకముల జయింపఁగల యుల్లాసమున నీమేనల్లుఁడొక్కఁడె యుల్లసిత భల్లపరంపరల భూవల్లభులనెల్ల నల్లకల్లోలమొనర్చుచు నెల్లుప్రజ్వరిల్లుచున్నవాఁడో? నాబంగారుకొండపైఁబడిన యాగాంగేయాదులనెల్ల భంగపరుప మనయరదంబునత్వరంబుగ నచ్చటికిఁబోనిమ్ము" అనిపలుక మాధవుఁడు తక్షణమ రథమావంకకు మరలించెను. కానిమార్గమధ్యమునఁ ద్రిగర్తాధీశ్వరుఁడును, వాని వెనుక నసంఖ్యాములగు కౌరవసై

న్యములును, పిదప సుశర్మఁడును, కృష్ణార్జునుల సడ్డఁగించుటచే, వారెంతో తడవునకుఁగాని గాంగేయుని నెదుర్కొనఁజాలరయిరి. అంతవరకు, మహావీర తరంగములతో నుప్పొంగుచుండిన యయ్యనూన సేనాసముద్రమును శౌర్య సముద్రుండగు సౌభద్రుఁడొక్కఁడె వారించెను. ఆహా! అట్టిమహావీరకుమారునిఁ గుమారునిగాఁగాంచుటకు సుభద్రార్జునులెంతటి పుణ్యమొనర్చిరోకదా ?

కడచిన యేడుదినమ్ములవలెఁగాక యెనిమిదవనాడుమాత్రము మనకథానాయకున కించుక విశ్రమముగలిగినది. ఆనాడతండు ధార్తరాష్ట్రులచే ముట్టడింపఁబడిన భీమసేనునకుఁ దోడ్పడుటతప్ప విశేషించి వర్ణింపవలసినదేమియు లేదు. కాని తొమ్మిదవనాడుమాత్రము వానికి బాహువులనిండఁ బనిగలిగెను. ఆనాడర్జున ధృష్టద్యుమ్నాదులు శిఖండి నెదుటఁబెట్టి భీష్మునిపైఁదలపడిరి. అభిమన్యుఁడు కపిలవర్ణములయిన తురంగములఁబూన్చిన యుత్తమరథంబుపైఁగూర్చుండి యత్యుత్సాహమునఁజెలరేగి, దూదినంటుకొను చిచ్చువలెఁ గౌరవసైన్యమునఁ జొచ్చెను. అట్లుచొచ్చి గురుకృపసైంధవాది మహాయోధుల నెల్లఁ జీరికింగొనక, విచ్చలవిడిగ సంగరవిహార మొనర్చుచుండ, దుర్యోధనుండు భీతిల్లి యలంబసునితో నిట్లనియెను. “ఓయీ దానవోత్తమా! చూచితే! కుంభసంభవాది మహాయోధులను గూడ లేశమును బాటింపక భీతిల్లక నిరాయాసముగ మనవ్యూహమునఁ జొరఁబడుచున్న యీసౌభద్రునిసాహసము! వీఁడు రెండవయర్జునుండనువిరా! ఇయ్యెనిమిదినాళ్ళనుండియు నీతఁడుమనమొనలకుఁ గలిగించుచువచ్చిన భంగపాటేమని చెప్పఁగలను?

నేఁడెట్లయిన వీనింగడతేర్పవలయు. ఇందుకు నీవ యర్హుండవు. పాండవులెవ్వరును వీనికిఁ దోడ్పడకుండ మేమెల్లర మడ్డుపడియెదము. నీవింక సత్వరముగ సౌభద్రుం దాఁకు” మని నియోగించినంతనే యలంబసుఁడు తననిశాచరసేనలతోఁ దక్షిణము పాండవసైన్యములఁ జీకాకుపఱుపఁ దొడంగెను. అప్పుడు ద్రౌపదేయులు రౌద్రాకారులై వానినడ్డగించి, లెక్కకుమీరిన రక్కసుల మూఁకలనుక్కడంచి, యయ్యలంబసుని పరితాపానలమునించుక చల్లార్చిరి. మాయాబలనిపుణుండగు నారక్కసులరేఁడంతతో నాగక, నిక్కి నీల్గుచు నయ్యుపపాండవుల కోదండములఖండించి, మందహాసమొనర్చుచు నొక్కొక్కనినైదైదుబాణములఁ గాయములుగాయములునడ నేసి, మిక్కిలిబాధించెను. ఆసమయమున నయ్యలంబసుని క్రౌర్యపాటును, సోదరులదుఃఖపాటును గిరీటిపట్టికని పెట్టియొక్క పెట్టున వాని పైఁబడెను. అభిమన్యాలంబసులిరువురునతిదారుణముగఁ బోరాడుటగాంచి, యుభయసైన్యములవారునుభయమొంది, “అలంబసుఁడుమాయాధికుఁడు. అభిమన్యుఁడు దివ్యాస్త్రమండితుఁడు. వీరిపోరాటమెట్లు పరిణమించునో” యనియాతురతతో నిరీక్షింపసాగిరి. పరస్పరజయాభిరతులైనవృత్రాసురసంక్రందనులచందమున నాసంక్రందనపౌత్రుండును నలంబసుఁడును నొండొరులఁదలపడియగ్నిజ్వాలలఁబోలునస్త్రజాలముల నొండొరులఁగప్పుకొనుచు, రక్తధారాపూరితములగు శరీరములతోఁ, దావాగ్నిరగుల్కొనిన పర్వతములగతిఁ జూపరులకుఁ గన్పడుచుండిరి.

బహువిధాస్త్రపరంపరల నెంతయుబాధించిశోధించి సౌభద్రుని సాధింపనేరక దనుజాధిపుఁడుఖేదించి, కడకొకసాధనం

బూహించి, తనమాయాబలమ్మున గాఢాంధకారముఁ బన్ని, యా కుమారవీరుని జీకాకుపరచి క్రూరశరానీకముల వానిఁగప్పఁదొడంగెను. తోడనే యభిమన్యుఁడును భాస్కరాస్త్రంబున నయ్యమేయమాయాంధకారమును రూపుమాపి, వానిక్రూరాస్త్రంబుల వారించినంతనే, భూమండలమునుండి భీష్మాదిమహావీరులును గగనమండలమునుండి వేలుపుమూకలును మేలుమేలని యాబాలు నెంతయుఁ గీర్తించిరి. పిదపనాదానవుండు తనదానవమాయలెన్ని పన్నినను నన్నిటిని నన్నరనందనుఁడిట్లు భేదించుచుండుటఁజేఁ బ్రాణభయంబున శీఘ్రముగఁ బలాయనుఁడయ్యె.

ఆపైనభిమన్యుఁడు కౌరవసేనలపైఁ జెలరేఁగి, మధ్యందినమార్తాండునివలె వెలుంగుచు, తనకడ్డంబైన వీరుల నెల్లఁగడతేర్చుచుండ, వీరాగ్రేసరుల ననేకులఁగూడుకొని గంగానందనుఁడాతనిమార్కొనియెను. కాని యలంబసుఁ డురగులుకొలిపిన వాని క్రోధానలంబింకను బ్రజ్వరిల్లుచుండుటచే, గాంగేయాదులును నాడభిమన్యుఁడనన్యసాధ్యుఁడని నిశ్చయించుకొనిరి. ఇంతలోఁ గృష్ణార్జునులుఁగూడ నేతెంచివానికిఁదోడ్పడిరి.

—:ద్రోణు నెదుటి యభిమన్యుడు:—

పదియవనాటి యుద్ధమ్ముతో భీష్ముని సైన్యాధిపత్యము పూర్తియైనది. రెండవరుద్రుండై వీరనృత్యమొనర్చునమ్మహాసీయునిధాటికి నిలువలేక, వాసుదేవపురస్సరముగఁ బాండవులాతనిపాలికేగి, సంగరవ్యాపారమునుజాలించి తమ్ముఁగటాక్షింపుమని యెంతయుఁ బ్రార్థించిరి. ధర్మమూర్తులును ననుగ్రహపాత్రులును, దనకుఁ బౌత్రులునగు పాండుపుత్రులను గంగాపుత్రుఁడుమన్నించి, కటాక్షించి, యాజన్మబ్రహ్మచారియై కామక్రోధాదు

లనిర్జించి, యిహలోకసౌఖ్యములవర్జించిన తనకీసంగరవ్యాపార
మనవసరమనియెంచి, వెంటనేయుభయంబొసఁగి తన్నుఁ గడతే
ర్చునుపాయమును వారికిబోధించెను. ఆయుపాయము శిఖండిని
దెచ్చి తనయెదుటనుంచుటయే! శిఖండి యెదుటనుండినయెడ
రణమొనర్పనని భీష్మునివ్రతము. ఇందుకొకమహాగాథయున్నది
భీష్ముని యత్యద్భుతచరిత్రమంతయుఁ బ్రత్యేకగ్రంథరూపమున
వివరింపవలసినదే కాని, మనయభిమన్యుకథా సందర్భమునఁబొడి
మాటలతో సూక్ష్మముగ వివరించుటకువీలులేదు. పాండుపుత్రు
లు తనపౌత్రులనిగాక, ధర్మమూర్తులగుట ధర్మరక్షణమునకై
తనప్రాణరహస్యమును వారికెఱింగించి పదియవనాఁ డమ్మహానీ
యమూర్తి శరతల్పగతుండై శరీరత్యాగమునకేకాదశీ పుణ్యది
నసమును నిరీక్షించుచుండెను.

భీష్మునితదనంతరమునఁ గౌరవసైన్యాధిపత్యము సకల
కురుకుమారక ధనురాచార్యుండగు ద్రోణాచార్యునకొసంగఁబ
డెను. తెలవారినంతనే కౌరవసేనాసమూహములతో సంగరరం
గమలంకరించి, వృద్ధుండగు నయ్యాచార్యుఁడు యౌవనవంతుల
కన్న నెక్కుడుధైర్యసాహసములతో విజృంభించి, పాండవసై
న్యములఁబరిమార్పఁగడంగెను. అప్పుడు ధర్మజునను మతంబున
నర్జునధృష్టద్యుమ్నులిరువురు నాతనికడ్డపడిరి. తక్కటివీరులును
దమకుత్సాహముగల ప్రతివీరులఁదలపడిరి. అందభిమన్యునకుఁ
గృతవర్మతోఁబోరాటముతటస్థించెను. కృతవర్మ సౌభద్రునిం
బొదివితీవ్రశరజాలముల నాతనిముంప నతఁడించుక నొచ్చియాగ్ర
హించియుగ్రబాణంబుల నాతనిధనుఃకేతనాతపత్రంబులఁద్రుంచి
యేడమ్ములవానిహయమ్ములను సారథిసహితమ్ముగ నొప్పించి,

మఱియు నేకువాడితూపుల నాకృతవర్మ చర్మమున నాటించి, వానిశిరమ్ముదునుమ నొక్కశరమ్ము సంధించుచుండెను. కృతవర్మయుఁ దనకు శిరఃఖండనము గాకుండ నాకుమారుని కేలంగల కోదండముఖండించి, యాగండమునుగడచెను. అందుపై సౌభద్రుఁడు నిర్భరాగ్రహచేతస్కుఁడై శరీరమునుమరచి, డాలుతోఁ గూడఁగేలఁగరవాలమూని, రథముపైనుండి కొదమసింగము భంగి లంఘించి, రథ్యముల ఖండించి, సారథినిఁగూలఁదన్ని, యురగేంద్రునిఁబట్టు పన్నగేంద్రునివలెఁ దటాలున వానిజుట్టుఁ బట్టుకొనియె.

ఇంతలోఁ గృతవర్మ దీనావస్థనరసి చెంతంగల సైంధవుండుఁ దిగ్గన తనరథంబుడిగ్గి యభిమన్యుం గవిసెను. జనకద్వేషియగుట నా సైంధవుఁగనినంతనే తనరోషంబగ్గలింపఁ గృతవర్మను విడిచి సౌభద్రుఁడు వానిపై విజృంభించెను. పరస్పరజయాభిరతులై సింహశార్దూలములగతిఁ బోరు నా సౌభద్ర సైంధవులను జూపఱులక్కజపడి చూడసాగిరి. అట్లుపోరిపోరి తనశస్త్రాస్త్రకౌశల్యమంతయు నభిమన్యుని కేలంగలడాలున వ్యర్థమగుచుండుటచేఁ గరచరణమ్ములాడక యాసింధుపతి ప్రాణభీతిం గొని వెనుకకుమరలెను. తోడనే శౌర్యాలంకారుఁడగు నయ్యర్జునకుమారుఁడు తనయశఃపదంబలంకరించి "ఓరోరి పిఱికీ! పోపో" మ్మని పలుకుచు నా సైంధవుని సేనలనెల్ల నేలపాలుగావించెను.

అట్లు పలాయనుండయిన సైంధవుని పాటునకెంతయుఁ గటకటపడి యచ్చటి నరపాలురెల్లరుఁ జెలరేగి, దీపికపైఁ ద్రాలు శలభములపోలిక నొక్కపెట్టున నక్కిరీటిపట్టిం జుట్టుముట్టిరి. చిన్ననాఁడు కన్నతండ్రికడ నభ్యసించిన సంగరరహస్యములనెల్ల

నాఁడు వినిరోగించుచు, సల్లెదుర్కొనిన రాజచక్రమునంతటిని నిర్వక్రపరాక్రమంబున ఛేదించి, యాలమందగతిఁ బారఁదోలుచుండ మద్రేశ్వరుం డాగ్రహించి సౌభద్రునిం దాఁకి, కన్నులుమిరుమిట్లుగొలుపు నొక్క మహాశకి నాతనిపై విడిచెను. అతి భయంకరముగఁ దన్నెదుర్కొనినయమ్మహాశక్తిని నిర్భయమ్ముగఁ జేపట్టి, యభిమన్యుఁడు క్రమ్మరదానినె శల్యునిపైఁ బ్రయోగింప, నయ్యది శల్యునిసారథినిదాఁకి వానినాహారముగాఁ జేసికొనియె. అయ్యద్భుత కార్యమ్మునరసి, యయ్యవసరమ్మున విరాటుఁడును, ద్రుపదుండును, ధృష్టకేతుఁడును యుధిష్ఠిరుఁడును - సాత్యకియుఁ గేకయపతులును భీమసేనుఁడును ధృష్టద్యుమ్నుఁడును శిఖండియుఁ గవలును ద్రౌపదేయులును దక్కటి పాండవవీరులును వేవిధంబులఁ గ్రీడికొడుకును బొగడఁ దొడంగిరి. ఆ స్తుతివాక్యంబులును సింహనాదంబులును నంబరమంటుచుండ సౌభద్రుఁడు నూతనోల్లాసమును వహించి మరల విజృంభించెను. ఆనాఁడా విజయనందను విజయంబును సహింపఁజాలక రోషాతిశయమునఁ గురుకుమారు లెల్లరు నొక్కపెట్టున నాతనిపైఁ బడి, క్రూరనారాచముల నాతనిం గప్పి ఘర్జిరి. మరియు వారికెల్లరకుఁ బ్రోత్సాహకరముగ శల్యుండొక్క గదాదండమును దనబాహుదండమునఁ దాల్చి యభిమన్యున కభిముఖుండై కవిసె. తనదోస్సారమున కాకురుకుమారులు హరిణశాబకములవలెఁ దోఁచుచుండుటచే వారినివిడిచి, తనకుఁదగినవీరుఁడు మద్రేశ్వరుండని సౌభద్రుండుప్పొంగి, తానును భయంకర గదాదండము నొండుదాల్చి "మద్రేశ్వరా! రమ్మురమ్ము,, ని యార్చుచు నుగ్రాకారమున నాతనిమార్కొనియె. అతని సమరవిజృం

భణమునరసి పాండవ కౌరవసైన్యము లాశ్చర్యనిమగ్నములై
నవి. కాని యట్లు శల్యుని మార్కొనినంతనే యాకస్మికముగను
దండగదామండితుండై భీముండయ్యెడకేతెంచి యభిమన్యుని
వెనుకకులాగి వానిస్థానమును దానాక్రమించుటచే నాకుమార
వీరుని వీరవిహారోత్సాహము పూర్తిగఁదీరలేదు. ఆమరునాఁడ
భిమన్యుఁడు లక్ష్మణకుమారునితో నొకమారును, సుప్రతీకము
ను క్రూరవారణముతోఁ జెలరేగిన భగదత్తునితో నొకమారు
ను మాత్రము పోరాడుట తటస్థించెను.

## —♦ పద్మవ్యూహము. ♦—

సౌభద్రుని వీరవిహారోత్సాహము సంపూర్ణముగఁదీ
రినదినముమూఁడవదినము. ఆదినమే వానిజీవితకాలమునందం
త్యదినము. ఆదినమే పాండవులకు దుర్దినము. కౌరవులకు సు
దినము. మహాభారతయుద్ధముజరిగిన పదునెనిమిదదినములలో
నన్నివిధముల సంస్మరణీయమైన దినమును, శౌర్యము, సధర్మ
మును ప్రత్యక్షముగఁ దాండవమాడిన దినమును, శోకదేవత
పాండురాజు కుటుంబమున నావేశించిన దినమును, చిన్ననాటి
నుండియు నర్జునప్రద్యుమ్నులకడ నేర్చినయభిమన్యుని యద్భు
తధనుశ్శాస్త్రకౌశల్యమశేషముగఁ బ్రకటింపఁబడినదినమునునగు
నప్పాపపు మూఁడవదినము తెల్లవారినది. తెల్లవారుటయు ను
భయసైన్యములును యథావిధి సమరతలమునఁ బ్రవేశించినవి.
ఆనాఁడు ద్రోణుఁడు పద్మవ్యూహమును సంఘటించెను. వ్యూహ
ములయందెల్ల సుప్రసిద్ధమగు నీపద్మవ్యూహాకారము పలువిధ
ములఁ జిత్రింపఁబడుచు నేటికిని మనయాంధ్రదేశమున మిక్కిలి
ప్రచారమున నున్నయది.

నాటి పద్మవ్యూహమ్మునకు ద్రోణుఁడు సకలదేశాధీశ్వరులను దళంబులుగను, రాజకుమారులు కేసరంబులుగను, కర్ణదుశ్శాసన బహుళసేనాపరివృతుండైన రారాజును కర్ణికగ నునేర్పఱచి, యభేద్యంబుగ నొనర్చెను. అమ్మొగ్గరమ్మునకు ద్రోణుండు తాను మొగమ్మున నిలిచి, జయద్రథాశ్వత్థామ కృపశకుని కృతవర్మ భూరిశ్రవశ్శల్యులను గురుకుమారులను కిదక్కన చోటుల నుండ నియోగించెను. అల్లు శత్రుభయంకరముగ నిర్మించిన యమ్మొన మొగమ్మున నిలిచిన కుంభసంభవునిఁ బాండవయోధులెల్లరుఁ గలఁపడిరి. సాత్యకి ధృష్టద్యుమ్న ఘటోత్కచ విరాట ద్రుపద భీమనకుల సహదేవాదిమహావీరులెల్లరు నమ్మొనభేదింపఁ బలువిధములఁ బ్రయత్నపడి భేదింపనేరక ఖిన్నవదనులయిరి. ధర్మజుండును మొగము వెలవెలఁబార నేమిచేయుటకుం దోపక కొంతవరకూరకుండి, కర్ణికార కేతన విరాజితుండును, విపుల విక్రమసంపత్పరిపూర్ణుండును నగు సౌభద్రుం జూచి, వీఁడు దక్క నన్యులీమొన భేదింపఁజాలరని నిశ్చయించుకొని వానిం జెంత కుఱమ్మని యిట్లనియె. "కుమారా! ఈ వ్యూహమును మేమెవ్వరము భేదింపనేరము. నీవును నర్జునుఁడును గృష్ణుఁడును బ్రద్యుమ్నుఁడును మాత్రమే దీని భేదమార్గము నెఱుంగుదురు. కావునఁ గృష్ణార్జునులు వచ్చి మనల నుల్లసమాడకుండ నీ చేవ యులావును మెఱయ నిమ్మొన భేదించి మాకెల్లరకును బ్రియమ్ముగూర్పుము." అనుటయు సుందరవదనారవిందమున మందహాసమ్మంకురింప నాధనంజయనందనుఁడు ధర్మనందను నుద్దేశించి "ఇమ్మొనభేదించు మార్గమంతయు నాతండ్రి నాకెఱింగించె. కావున నమ్మహనీయునికడ నేర్చిన సంగరకళారహస్యములనెల్ల నేడు వెల్లడిం

చి, దీనినిభేదించి ఛేదించి చించిచెండాడెద. కాని లోనఁబ్రవే
శించి మరలవెలుపలికి వెడలు నుపాయమునుమాత్రము నేనువి
న లేదు. అయిన నేమాయె? దీనిం జొచ్చు నవసరమ్మున నానే
ర్పును నాచొరవయు మీరెల్లరుఁ గనుంగొనెదరుగాక" అనిప
లికి వానివెఱవెలపాటు తొలఁగించెను. ధర్మజుండును వానిప
లుకులకెంతయు సంతసించి, "కుమారా! నీవమ్మొన వెడలు తెఱం
గు నెఱుంగకున్న నేమి? నీవించుక భేదించి దారిచూపించితి వేని
మేమెల్లరమును నీవెనువెంటనే లోనఁబ్రవేశించెదము. ఈవర
ముమాత్రము మాకొసంగు" మని పలుకుచుండ భీముఁడుఁగూ
డ నభిమన్యుని మరింతప్రోత్సహించుచు "కుమారా! మీతం
డ్రి సంశప్తకులతోఁబోరుచున్నాఁడు వానిలేని లోపమునుదీర్ప
నీవగ్గుండవు; నీవీమొననించుక భేదించుమాత్రతనే సాత్యకిద్రుప
ద ధృష్టద్యుమ్న విరాటులతో నేనమోఘవేగంబుగ లోనఁబ్ర
వేంచి వ్యూహమంతయుఁ జించిచెండాడెదను." అని గంభీరముగఁ
బలికెను. అదివిని యభిమన్యుఁడాతని యాననమాలోకించి, కీ
చకాంతకా! కుంభసంభవాదులు నిశ్చేష్టితులగునట్టు లిమ్మొన
భేదింపక కురుముఖ్యుండగు మనధర్మజుని ప్రయత్నమువ్యర్థమౌ
నర్తునా? నన్నుఁగాంచి సుభద్రార్జునులు పొందు సంతోషమం
తయు రిత్తఁబుచ్చెదనా? గోవులందోలు గోపకునికైవడి నొ
కపిన్నవాఁడీమ్మహాసైన్యములనెల్ల నెట్లు పారఁదోలుచున్నాఁడో
యని విన్నవారును గన్నవారును నన్నుఁ బలువిధములఁ గొని
యాడునట్లు నేఁడీపద్మవ్యూహమును జిందరవందర చేసి, కౌరవేం
ద్రుని విజయాసక్తి నడంచి మాయయ్యకును, మామామకును
నమందానందము సంఘటించెదను" అని గంభీరముగఁ బ్రత్యు

త్రమొసంగెను. అకుమారవీరు ధైర్యసాహసములనుబాండవాగ్రజుఁడుమెచ్చి, యశశ్శౌర్యధైర్యములు వర్ధిల్లునట్లు వాసినాశీర్వదించె.

తదనంతర మర్జునపుత్రుండు తనసారథియగు సుమిత్రుంజూచి ద్రోణానీకముపై రథమును బోనిమ్మనుటయు నాతండట్లొనర్పక "సౌభద్రా! నీవు కేవలముబాలుఁడవు. కుంభసంభవాదులు మిక్కిలి ప్రౌఢులు. బహువిధసమరకర్కశులు. రణరంగములఁజొచ్చి యెఱుఁగని నీచేఁజచ్చువారుకారు." అనిపలికియూరకుండెను. అమ్మాటలకుఁ గిరీటికొడుకు చిఱునవ్వు నవ్వుచు "ఓయీ! సుమిత్రుఁడా! నేఁడునిర్జరసేనలతో దేవేంద్రుఁడే తెంచి నన్నెదుర్కొనుఁగాక! కేలఁ ద్రిశూలంబుదాల్చి ఫాలాక్షుండు నన్నడ్డగించుఁగాక! వేయేల? నాకెదురై యీకృష్ణార్జునులే నన్నుమార్కొనెదరుగాక! వెనుకకడుగువేయను. నిర్జింపకమానను. ఈద్రోణుఁడును వీనితోడి యోధులును నాకులక్ష్యమా! నీవాలసింపక సత్వరమ్ముగ మనయరదంబుసాగని" మ్మనుటయు సుమంత్రుఁ డనుమానించుచు నమ్మొనకభిముఖమ్ముగ నరదంబుసాగించెను. తోడనే కుంభసంభవునకుఁదోడుగ నచ్చటి మహాయోధులెల్లరు సౌభద్రునిపైఁబడిరి. అభిమన్యుఁడా యోధవారమును దివ్యాస్త్రజాలములఁ జీకాకుపరచి పారఁదోలి, నిశాతశరపరంపరల భారద్వాజుని బాధించి, సాధించి, కర్ణికారధ్వజకాంతులతో నరదంబు మెఱుఁగు మెరయునట్లు మెరయుచుండఁ దటాలున నమ్మొగ్గరంబునఁ బ్రవేశించెను.

—పద్మవ్యూహమునందలి యభిమన్యుఁడు—

ఇట్లు దేవాసురలకయిన నభేద్యంబగు నాపద్మవ్యూహ

మును సౌభద్రుఁడు భేదించి, ప్రవేశించి, మహాసముద్రమధ్యంబునఁ దిరుగు మందరగిరి తెఱంగున, శుష్కకాననమున సంచరించు ఘోరానలము భంగి, దక్షయాగమునందలి వీరభద్రుని విధమ్మున వీరవిహార మొనర్చుచు నమ్మోహారంబు రూపుమాపి క్రూరనారాచముల గజకుంభములఁ జీల్చుచు హయంబుల నడఁగించుచుఁ బతాకమ్ములఁ బడ నేయుచు, నాతపత్రమ్ములఁ దుత్రిళ్ళఁ గొట్టుచు, ధనువులఁ దునియలొనర్చుచుఁ గవచంబులఁ జించుచుఁ గరవాలంబుల ఖండించుచు మేనులఁ జెండాడుచుఁ దూపులఁ దూలించుచుఁ గరచరణాద్యవయవముల వేరు సేయుచు నెత్తురుపారించుచు నమ్మొగరమ్మును మిక్కిలి చిక్కువెట్టి కలంగించి తొలంగించి దీనదశకుం దెచ్చెను. పద్మాకరమును గలంచు భద్రగజమువలె నప్పద్మవ్యూహమును గలంచు సౌభద్రు నీక్షించి కౌరవేంద్రుఁ డుగ్రాకారుఁడై యూకలిగొన్న సింగమును దాఁకు నేనుంగు తెఱంగున నప్పడుమార్కొనియెను. అట్లభిమన్యుం దాకిన రారాజునీక్షించి భారద్వాజుఁడు చేయివీచి యెలుంగెత్తి "సైనికులారా! రండు! రండు! రారాజునకుఁ దోడ్పడుఁడు! అభిమన్యుఁడుద్దండుఁడు! మీ మీ ధైర్య సాహసంబుల వినియోగింపుఁడు" అని హెచ్చరించి, తానును తనయరదంబావంకకే సాగించెను. ఆకంఠస్వరము విన్నంతనే కృపుఁడును గురుకుమారుఁడును కృతవర్మయుఁ గర్ణుండును సోమదత్తపుత్రుండును, శల్యుఁడును సౌబలుండును మున్నగు మహావీరులెల్లరు గురుని వెంటబిరబిర నేగి కురుపతికిఁ దోడుగఁ గవ్వడికొడుకు నెదుర్కొనిరి. లేళ్ళమందపైఁ బడు బెబ్బులి విధమ్మునఁ దన్నెదిర్చిన యోధవీరుల మార్కొని తీవ్రసాయకముల నొక్కొక్కని నుక్కడంచి పారఁ

దోల నాఘనవాయునందనుం డన్యులకసాధ్యుండని వానిని సాధింపఁ గుంభసంభవుం డుపక్రమించెను. నలుదెసలకుం జెదరిన శల్యకృపకృతవర్మాదులును మరలఁగుమిగూడి విజృంభించిరి. అట్లు విజృంభించి, కృపసుయోధనభూరిశ్రవులుమూఁడేసియమ్ములును, ద్రోణుండు పదియేడు బాణంబులును, వివింశతి యిరువదికోలలును, గురుసుతుండైదు శరమ్ములును, బృహద్బలుం డెన్మిదినారాచంబులును, శల్యుండారుమార్గణంబులును, కృతవర్మయేడుసాయకంబులును, సౌబలుఁడు రెండుతూపులును, దుశ్శాసనుండు పండ్రెండు తూణీరంబులును, దుస్సహుండు తొమ్మిదిశిలీముఖమ్ములును నొక్కమారర్జునకుమారుపైఁ బ్రయోగించిరి. సౌభద్రుండును వానినన్నింటినిద్నియలొనరించి, తురగసూత కేతనములతో నశ్మకుని నేలపాలుగావించెను. ఆదుఃఖమున నాచార్యప్రభృతులును గొందరుకురుకుమారకులును దమ సేనలఁ బురికొల్పుకొనుచు మరలఁజెలరేగ నభిమన్యుఁడు కినిసి తీవ్రాస్త్రంబుల వారినెంతయు నొప్పించి, కర్ణునిందాకి యొక్కవాడియమ్ము వానియంగమ్మును దూసిపోవునట్లు లేసెను. తోడ నేకర్ణుండును సొమ్మసిల్లెను. కురుకుమారులు వెనుకకుఁ దొలఁగిరి. అప్పట్టున శల్యుఁడెంతయు రౌద్రాకారుఁడై మార్కొని నిశితశరపరంపరల నన్నరనందనుని ముంపఁదొడంగెను. అభిమన్యుండయ్యంపగమినెల్లఁ దునుమాడి కర్ణుపట్టులేవాడికోలల శల్యుని శల్యంబులనాటింపఁ బాపఘుతండుక్కుదక్కి వెలవెలపాటుతో రథంబుపై మూర్ఛిల్లె. శల్యుండు మూర్ఛిల్లినంత నే సుభద్రికొడుకు శంఖంబుపూరించి పెద్దపెట్టునార్చి విజృంభింపఁ గౌరవ సేనలన్నియుఁ దమతమ

యోధవీరుఁతో ద్రోణుఁ డెంత వారించినను నాగక వెనుకకుఁ బరుగిడం
దొడంగెను. అప్పుడక్కుమారవీరు నుద్దేశించిన సురసిద్ధసాధ్య
విద్యాధరుల స్తుతివాక్యంబులును శత్రుభూపాలుర హాహారావం
బులును నేకమై భూగగనమధ్యభాగంబుల నెల్లెడ వ్యాపించె.

అట్లు శల్యకుమారుండగు నశ్మకుండు కడతేరుటయు శ
ల్యుండు మూర్ఛిల్లుటయు సహింపలేక శల్యసోదరుండు క్రోధా
యత్తచిత్తుండై వాడిగలపదియమ్ముల నాబాలకుని యంగమ్ముల
గాఢముగ నాటనేసెను. తోడనే వాసవికిశోరుకు రోసమ్మున నా
తనిహయమ్ములఁ జంపి, సూతుం దెగటార్చి పతాకమ్ములను బడ
నేసి, విల్లుతోఁగూడ వాని బాహువులఁ ద్రుంచి, రథమ్ము నురూ
పుమాపి, చుట్టుంగల రాజవీరులెల్లరుఁ జెల్లాచెదరగునట్లు వాని
శిరమును ఖండించి చిత్రవధగావించెను ఆభయంకరకృత్యము
ను గన్నులారఁ జూచి సహింపఁజాలక, ద్రోణకృపాశ్వత్థామకృ
తవర్మబృహద్బలకర్ణప్రముఖ యోధవరులెల్లరు నొండొరులఁ బే
రులు పెట్టిపిలుచుకొనుచు నున్మాదమెత్తి నట్టలగంతులిడుచుఁ దమ
తమబలంబులఁ బురికొల్పుకొనుచు, రథనేమిధ్వానములును గజ
ఘంటాఘణఘణాత్కారములును, తురంగకింకిణీకిణాత్కార
ములును, హుంకారములును నహాంకారములును శంఖనిస్వన
ములును భూనభోంతరాళములనిండ నక్కిరీటిపట్టిం జుట్టుముట్టిరి.
అమ్మహావిజృంభణమునకు ధనంజయనందనుండు లేశమును జలిం
పక, యట్టహాసమ్ము చేసి, లాఘవలక్ష్యశుద్ధిచిత్రత్వదృఢత్వంబు
లఁ గృష్ణార్జునులు చూపునేర్పు చూపుచుఁ బరివేషవలయంబు
నఁ గిరణస్ఫురణచే దుర్నిరీక్ష్యుండగు చండభానుకరణి మండలీ
కృతమైన కోదండమునుండి యఖండముగ వెడలు శరపరంపరల

చేఁజూపరులకు రౌద్రమూర్తియైతోఁచుచు, భీషణంబగుగుణ ఘోషమ్ముతో బెడిదంపునారసంబులు ప్రయోగించి యార్చి, లోకభయంకరముగగర్జిలుచుఁ బలుపిడుగులురాల్చు ప్రళయ కాలవలాహకంబునవలెవిజృంభించి, యేమిచేయుటకుందోపకకర చరణంబులాడక చేష్టలుదక్కి యాచార్యుండూరక చూచుచుండు నట్లు తత్సేనావితానములనానావిధబాణపరంపరలముంచిపరువె త్తించెను. అట్లుపరువెత్తించిపరువెత్తెడుసేనలఁబారిపోనీకమరలవి జృంభించి వెంటఁదరుముచుఁబీనుఁగుపెంటలుగావించుచుండ, స త్కుమారవీరునాలోకించి వికసితవదనుండై ద్రోణుండు [redacted]రాజు మనంబుననాటునట్లు లాతఁడువినుచుండఁగృపునితో నిట్లనియె. "ఓయీ! ఈధనంజయునందనుఁడొక్కఁడెచెలరేగి ఘోటమ్ము లఁగూల్చుచుఁ గుంజరమ్ములభంజించుచు సేనలనేలపాలుగావిం చుచుఁ దనయన్నలును దమ్ములునుజెలులును దండ్రులునుమా మలు మొదలగువారెల్లరు నుల్లముల సంతసిల్లునట్లు నానమ్మిన యోధవీరులందరినెట్లువినాశము నొందించుచున్నవాఁడో" అను టయురారాజుదీనాననుండై మొగంబున లేనినవ్వుదెచ్చుకొని, క ర్ణశల్యాదులగు యోధవరులెల్లరు వినుచుండవానికిఁ బ్రత్యుత్త ర ముగనిట్లుపలికె "ఓహోహో! వీరాలెల్లరు నీపలుకులు వింటిరే? ఇమ్మహనీయుఁడు ధనువుపట్టినవారికెల్లగురుఁడుఁడట! దోర్బలప్ర సిద్ధుండఁట! బాలుని, నొంటివానిని, జంచలాత్ముని వెంగలిని గనుఁబెద్దఁజేసిపొగడఁదొడఁగుచున్నాఁడు. ఈబాలుండుమనమె డనెంతతుత్రిళ్ళిపడినను బార్థునందలికూర్మి పెంపున గురుండుపీనిం జంపఁదలంపఁడు పీనియుపేక్షచేతనే పోరాటమ్మున వానియాట లుసాగుచున్నయవి. ఇదియంతయుఁ దనప్రతాపంబెయనియూ

కజ్జంభారకవిజ్ఞానిగుచున్నవాఁడు మీరింకఁ దడవు సేయక మీ మీ తీవ్రశస్త్రాస్త్రనిహతుల నాబాలుని గాలునిపాలికిఁ బోఁద్రోలుఁడు" రారాజుపలుకులువిని యచ్చటిరాజవీరులెల్లరుఁదమ తేజమ్మెరయ నభిమన్యునిమార్కొననుద్యమించుచుండ దుస్ససేనుఁడువారినివారించి "ఓవీరవరులారా! భానుమండలమునుగబళించురాహువు తెఱంగున నేనొకరుండనపోయి యీబాలకుని బరిమార్తు. ఈతఁడుమృత్యుండగుటవిని కృష్ణార్జునులు ఘొల్లుననేడ్చి ప్రాణములువిడి చెదరు. అంతతో మనపగయంతయుఁదొలంగు. నాబాహువిక్రమంబును నేఁడుమీరెల్లరుఁ బరీక్షింపుఁ" డను గంభీరముగఁ బలికి తనధనుఃకౌశల్యమభిమన్యునికడఁ బ్రకటింపనారంభించెను. అభిమన్యుండును నుజ్జ్వలబాణపరంపరలఁ బెనంగన య్యిరువురిపోరును ఘోరంబై చూపరనాకర్షించుచుండెను. అట్లుపోరిపోరి సుభద్రానందనుండు దుస్ససేనుని విల్లుద్రుంచి, భల్లమున వానియొడలెల్లఁ జెక్కి మిక్కిలినుక్కించి యతనితో నిట్లనియె. "ఓయీ! దుస్ససేన! ఆనాఁడట్లునిండుకొలువున ధర్మనందనుని నొవ్వఁబలికిన ఫలంబిప్పుడెనీవొందఁజేసెదను. చలింపకయించుకసేపు నిలువుము! క్రూరుఁడవును నవినీతుఁడవును మదాంధుఁడవును స్వల్పబుద్ధివినగునిన్నుఁగడ తేర్పకున్న, నన్నుఁ గాంచిపెంచి ప్రేమించిపెద్దఁజేసిన నాగురువంపుఁ దల్లిదండ్రుల ఋణంబుతీరదు" ఇట్లుపలికి వానిమూపులసంధి యెముకలనాట నొకబాణమ్మును, వక్షమ్మునఁ బెక్కుబాణములును దీవ్రముగఁ గ్రుచ్చినంతనే, యతండుత్రుళ్ళి యెన్నఁడోచచ్చినట్లు రథముపైవ్రాలెను. సారథియు మూర్ఛిల్లినదుస్ససేనుని రథంబుతోఁ గూడ నావలికిం గొనిపోయెను.

అచ్చటఁ బాండవులు పద్మవ్యూహమునఁ బ్రవేశింపఁ బలువిధముల యత్నించుచు నడ్డుపడు సేనల నెల్లఁ బారఁదోలుచుఁ దలలెత్తి యభిమన్యుఁడు దుశ్శాసనున కొనర్చిన గర్వభంగమును జూచి యెంతయు సంతసించి, వానిని మిక్కిలి శ్లాఘించిరి. తమ్మునకుఁ గల్గిన భంగపాటును దలంచుకొని సుయోధనుఁడు మిక్కిలి ఖేదపడుచుండఁ గర్ణుండు వానినూరడించి, తన సేనలతోఁ గూడ సౌభద్రునిపైఁ బడెను. ఆ సేనా వితానముల నెల్ల నరనందనుఁ డుక్రమందించి, డెబ్బదిమూఁడమ్ముల నయ్యంగపతి యంగముల గాఢముగ నాటనేయు నతండు జేగురు మొగమ్ముతో నా బాలకుని నన్నేకదివ్యాస్త్రములముంచెను. కాని వానిని లేశము నభిమన్యుండు సరకుగొనలేదు. ఆ దీర్ఘ సంగరమునఁ దుట్టతుదకుఁ గర్ణుండు మిక్కిలి డస్సిపోయెను. అది కనిపెట్టి యన్న కించుక విశ్రమ మొసంగుటకై కర్ణుని సోదరుండు వాని స్థానము నాక్రమించి యభిమన్యున కుమరలఁ బనికల్పించెను. కాని పాపమతఁ డెంతో సేపు వరకుఁ దన యన్నకట్టి విశ్రమ సౌఖ్యమును గల్గింపఁజాలక పోయెను. తన్నెదుర్కొన్న కర్ణసోదరుని జూచి, ముఖకమలంబున నెఱ్ఱని చిఱునవ్వులు నివ్వటిల్ల భల్లపరంపరల వాని యొడలెల్ల జల్లెడ చేసి, రథ్యసారథుల ముంచి, శత్రుభయంకరమగు తన బాహు పరాక్రమమున నాతని శిరమును సౌభద్రుఁడు గ్రక్కునఁ దెగనేసెను.

అట్లు తమ్ముఁడు కూలినంతనే రోషోద్రేకమున నంగరాజు శరీరమును మఱచి మరల నభిమన్యుం దాకెను. వానితోడ నేయచ్చటి బలములన్నియు లక్షలకొలఁది నా కుమారవీరు నొక్కమ్మడి నెదుర్కొనెను. మహాసముద్రమధ్యమున మందరపర్వతమువలె నయ్యనంత సేనాసమూహమధ్యమునఁ గవ్వడికొడుకు తిరుగాడు

చుఁ దనయురదమును గణ్ణదెసకుఁదోలించి, సోదరవియోగదుః ఖపూరితుండగునాతని శితశరపరంపరలఁబరామర్శింపుచుండ న య్యంగరాజుధైర్యముసెడి వెంగలియైదూరముగఁ దోలంగెను. తక్కుటిబలములును వానిమార్గమునే యనుసరించినవి.—ఇట్లున లుదెసలకుఁదొలఁగుసైన్యములను దన్నాయకులను ద్రోణుండు వీక్షించి "ఓయీ! కర్ణా! నిలునిలుము, ఓకృపుఁడా! నీవిట్లేల ధై ర్యమునువిడనాడుచున్నావు? సౌబలా! నీబలాతిశయంబింతయే నా? బాహ్లీకా! నీవిట్లుభీతిల్లవచ్చునా? దుర్యోధనా! నీబలంబు నుజ్జ్వలంబునుజూపి నీసేనలనిలువఁబెట్టికొను" మని పెక్కుభంగు లఁబురికొల్ప నాతనిమాటలెవ్వరును బాటింపలేదు. ఇట్లు ప్రళ యకాలనిర్ఘాతపాతములఁబోలు శరవ్రాతముల నాపద్మవ్యూహ మును భీమఁగు పెంటఁగావించుచు నాకుమారకంఠీరవుండంబర మధ్యంబున భాసమానుండగుమార్తాండుని రెండవమూర్తివలె శోభిల్లుచుండెను.

అచ్చటవ్యూహద్వారముకడఁ బాంచాల యాదవ పాం డ్య కేకయమాత్స్యసైన్యములతో ధర్మభీమనకులసహదేవాదు లెంతవిజృంభించినను నెన్నివిధములఁ బ్రియత్నించినను లోనఁ బ్రివేశించు నవకాశముకలుగలేదు. నాడావ్యూహద్వారముకడ సైంధవుఁడమ్మహావీరులనెల్లరనడ్డగించెను. సామాన్యరథికుండ యిన సైంధవుఁడంతటి మహాయోధులనడ్డగించి నిలువరింపఁగ లుగుటకొక ప్రబలకారణముకలదు. పాండవులరణ్యమునయున్న ప్పుడు ద్రౌపదినతండుమోహించి వారింటలేనిసమయమున నా మెనుబలవంతముగఁ దనరథమునసనిడికొని పారిపోవుచు విధివశ మునవారికిఁబట్టుపడి, యందుభీమునిచే సంపూర్ణముగఁబరాభ

విసంబడెను. అపరాధవమునను సైంధవుండతి నిష్ఠాగరిష్ఠుం డై మహాతపంబొనర్చి భక్తవత్సలు డైన పరమేశ్వరుని మెప్పించి, పాండవుల జయింపఁగలుగువఁల్లు తనకునరంబిమ్మని ప్రార్థించెను. అర్జునునొక్కనిదక్కఁ దక్కినవలువురను నీవొక్కనాఁడుమాత్రము జయింపఁగలుగుదువనికటాక్షించి యప్పరమేశ్వరుండంతర్హితుండయ్యె. ఆవరముప్రభావముననే నాఁడు భీమసేనాది యోధవీరుల నతఁడు నిరాయాసముగ నిలువరింపఁగలిగెను. అందుచేతనే వ్యూహమధ్యమందలి మనయభిమన్యునకునాఁడొక్క రథికుఁడైనఁ జేదోడువాదోడుగ నేగఁజాలకపోయెను. ఇట్లువ్యూహమున లోకైకవీరుండగు నభిమన్యుఁడు ప్రతాపానలమున మ్రగ్గి పరుగిడఁదొడంగిన యోధవరులనెల్ల ద్రోణుండు మహాప్రయత్నమున నాపి, పురికొల్పిమరల వారందరితోఁగూడ నాబాలకునిమార్కొనియె. విరిగిన యోధులెల్లఁ దనపైఁ దిరుగఁబడినంత నేనే యివోసిన యగ్నిజ్వాలవలె భగ్గునమండుచు సుభద్రకొడుకముక్కలనెల్లఁజీకాకుపరచి రణరంగమున నెత్తుటివరదలు ప్రవహింపఁజేయుచుండ, వృషసేనుఁడుకడంగి యుజ్వలశరజాలముల వానివిజృంభణమును గొంతయడంచెను. అందు పైనాకుమారవిక్రముఁడించుకనొచ్చి, కోపించి, వృషసేనుసారథినిదునిమి, కార్ముకమునుఖండించి వాని వాహనములను దివ్యాస్త్రములముంచి, మేనునొప్పించినంత నతనివారువములు బెదరి యయ్యరవీడుఁగు నీడ్చుకొనుచు నచ్చటినుండిపారిపోయెను. అదిచూచి శౌర్యధుర్యుఁడు వసాతీయనురాజు తనకుఁగాలమాసన్నమగుటచే విజ్రుంభిగుచుఁ జెలరేగి యభిమన్యునిపైఁదీవ్రములగు నారుబాణములేసి, తనపైనతండువిడిచిన క్రూరనారాచమునఁ గంఠము తెగి వెంట

నేగతించెను. వసాతిమ్రుతివలన నచ్చటిపీరవితతిభీతింగొని పర
స్పరాహ్వానమొనర్చుచు సింహనాదంబులు గుణటంకారములు
నుజెలంగ నొక్కుమ్మడి నాకవ్వడికొడుకుపై మరలనురవడించె.
సానపట్టినకోలఁది విన్నాణమెసంగెడి కృపాణముకైనడి, శత్రు
సేనలు మరలమరలఁదన్నుఁ జుట్టుముట్టుకొలఁది భీభత్సానందనుం
డుమరింతరణోత్సాహమునువహించి, రణరంగమునుభీభత్సము
నుగావించుచు, సత్యశ్రవుఁడు మొదలగు రాజవీరులనేకులఁదు
దముట్టించి, నేను నేననిమాటిమాటికిఁ దనపైఁబడుచు వచ్చెడు
యోధవీరులపరాక్రమమును మహామత్స్యముఁనోటంబడిన చిరు
చేపతండమువలె, దావానలముఁదగుల్కొనిన మృగకులముక
రణి, సముద్రమునఁజొచ్చిన యేరులచందమునఁ గావింపుచుం
డనచ్చటి సైన్యములన్నియువిచ్చలవిడిగ నలుదిక్కులకుఁ బారి
పోయెను. అట్లుపరుగిడిపోయెడుమూకలనెల్ల శల్యనందనుఁడగు
రుక్మరథుండుపోవ్రుచేసికొని "ఇదేవచ్చితి నేనుండ మీకేలభ
యం" బని కేకలిడుచు మిడుతవలెఁదుష్పతువ్వనఁ దూలుచువ
చ్చి యాకుమారవిక్రముని పరాక్రమానలమునఁబడి చప్పునభ
స్మమయ్యెను. రుక్మరథుఁడు మడయుటచే వానిహితులగుభూ
పతులనేకులుగూడి పేడికోపమునఁజెలరేగి మార్తాండమం
డలమునుగప్పు మేఘమాలికలవలె నభిమన్యునిపైఁబడి వానింగ
ప్పివేసిరి. అదిచూచి యాకుమారవీరుఁడు కడతేరి యుండునని
సుయోధనుఁడు సంతసించుచుండ, కోలలపోట్లకుంగనలి చెల
రేగుభద్రగజంబుగతి నాసౌభద్రుండు తత్సేనామధ్యము నుండి
చెలరేగి, గాంధర్వియనునొక మహామాయగావించె. అయ్యా
దిమున్నగుమునితపంబునకు మెచ్చి తుంబురప్రభృతులువానికో

సంగినట్టిది. ఆమాయాప్రభావమున నచ్చటిసకలయోధవీరుల చూపులకును, వీరాగ్రేసరులనేకులువచ్చి తమ్మనేకశస్త్రాస్త్రములఁ గప్పుచుండినట్లుతోఁచుచుండుటచే భయాతిశయమునఁ గరచరణములాడక రాజచక్రమంతయుఁ జిత్రప్రతిమవలెనుండెను. అప్పుడభిమన్యుఁడు నిశ్చేష్టితంబయిన యయ్యోధవర్గమునందు వలయాకారముగ సంచరించుచుఁ గదళీకాంతారమునువలె నతిసూక్ష్మముగ వీరవరులఁ జెండాడఁదొడంగెను. ఆదారుణరణవిజృంభణమును సహింపలేక రారాజుమరల నొకమారాకుమారునిపైఁబడికొంతవరకుఁబోరాడిఓడి, తక్కటియోధులంగూడి చింతిల్లుచుండెను.

అట్లుసుయోధనుఁడు మరలినంతనే తక్కిన కురుకుమారులును వారితోడియోధులును శరీరములుచెమటలెక్క, మొగంబులువెలవెలంబార, నాలుకలఁదడియారఁ గాళ్ళుగడగడవడంక నలుదిక్కులుచూచుచు ధైర్యమువిడనాడి, యేక్షణంబున నభిమన్యుండెవరిపైఁబడునోయని దిగులుపడుచుఁ బ్రాణములరచేతులయందుంచికొనియుండిరి. తనకుఁగల్గిన పరాభవమునుదలంచుకొనుచు దుర్యోధనుండు గొంతవరకుఁజింతిల్లి యంతకంతకువెనుకకు జరుగుచుండిన యోధులనెల్లరనరసి, యింకనుపేక్షించిన కార్యములేదనియెంచి, మరలగురుపుత్ర కృపకర్ణ కృతవర్మ బృహద్బలుల సాబలసమేతంబుగా నభిమన్యుందాకెను తోడనేసౌభద్రుఁడు పెద్దపిడుగుచందమునగర్జిల్లి యయ్యోధవరులమధ్యంబున నురికినంతనే వెల్లమొగంబులతో నాభూవల్లభులెల్లరు నొక్కమాఱుత్రుళ్ళిపడిరి. ఆత్రుళ్ళుపాటు చూచి లక్ష్మణకుమారుండు మున్ముందుగఁ దనయరదంబు నరివందనుని

ప్రసాగించుచుండఁ దనకుమారు నెంటిగఁ బోనీయక దుర్యోధనుఁడు పరుగు పరుగునవచ్చి వానిం గలసికొనెను. రారాజును యువరాజునుగూడ నయ్యభిమన్యునిధాటికినిలువఁజాలరనియెఱింగి వారికెట్టికేఁడును మూఁడకమున్నె యచ్చటి యోధవారమంతయు వారికిఁదోడుపడెను. ఇట్లు గుమిగూడిన వీరవర్గమునంతటిని శౌభద్రుఁడు తేఱిపారఁజూచి యెడతెఱిపి లేనివడగండ్లవానంబోలు నంపవానగురిపించి, పులికొదమనుదాఁకు సింగపుఁగొదమవిధమ్మున లక్ష్మణునిందాకి యొక్కొక యమ్మున వాని బాహుద్వయమును గాఢముగనొవ్వనేసి, మఱియొక దివ్యశరమున వానికంఠముఁ దుంచి, కర్ణకుండలకాంతులు దిక్కులఁబిక్కటిల్లునట్లు లతనిశిరమును నెగరవైచెను. ఆఘోరకృత్యమును గన్నులారఁజూచి సుయోధనుఁడు దుఃఖించుచుండ గురుఁడును గురుపుత్రుఁడును గృపుఁడును గృతవర్మయుఁ గర్ణుఁడును బృహద్బలుఁడును గూడి క్రీడికొడుకు పైఁబలువాడియమ్ములనిగిడించిరి. అభిమన్యుఁడాతూపులనెల్లరూపుమాపి తనయరదము నతిరయమున సైంధవుని దెసకుఁబోనిచ్చుచుండ ననేకులునిషాదులును గళింగులునుగజబృందములతో నాతనికడ్డుపడిరి. అప్పుడయ్యతిరథసింహుఁడు సింహనాదంబొనర్చి ప్రచండఖడ్గధారల నాసేనలనెల్ల నురుమాడి, పెక్కుబోతులొక్క పులింజుట్టుముట్టినట్లు తన్నుంజుట్టుముట్టెడి రిపుకోటింగీటడంచుచు, నేబదిబాణముల ద్రోణుని నెనుబదిబాణములఁగృతవర్మను బదిబాణముల గురునందనుని నొక్కబాణమునఁగర్ణునిమిక్కిలినొప్పించి, కృపుని విరథునిగావించి, బృహద్బలునిమేన ముప్పదిబాణములగుప్పించి వారికిఁదోడ్పడువారినెల్లఁగీడ్పఱచుచుఁ గోత్రభిత్సబృందారకులను రాజులను యమా

లయమునకంపించెను.

అప్పుడు బృహద్బలుఁడు లేచి తనరథమును సంసిద్ధముగా
వించుకొని, గురుకృపాదులగుతక్కినయేవురితో నభిమన్యునిదా
కి రోషంబు పెంపున నుజ్జ్వలమార్గణములనాతనినొప్పించెను. అ
మ్మొగ్గరమునఁ జొచ్చినది మొదలు తన్నెదిరించినట్టియుఁ దానెది
రించినట్టియుఁ బ్రతియోధునికడను సంపూర్ణవిజయమునొందు
చుండుటచే నవ్విజయనందనుఁడు తద్విజయానందమున నాబృ
హద్బలునిదీవ్రముగ నెదుర్కొని తొలుదొల్త వాని కేలంగలచా
పమునురూపుమాపి, పిదపఁ గేతువుందునిమి పిమ్మటనశ్వములఁగ
డ తేర్చెను. విరథుఁడయ్యుభూరిదోర్బలుఁడగు నాబృహద్బలుఁ
డు వెనుదీయక యశ్వశూన్యమగుతనరథమును గ్రక్కునడిగ్గి
ఁవాలుతోనొక్కకరవాలుగైకొని మహాసముద్రమును నెదురీదు
నట్లు శౌర్యసముద్రుఁడగు నాసౌభద్రునిపైఁ బడుచుండ నాబా
లుండొక్కతీవ్రనారాచమును వానిహృత్పుటమునఁగుఱిచ్చి లో
కాంతరగతునొనరించెను. కోసలేంద్రుఁడుకూలినంత నే తద్బంధు
భూపతులనేకులొక్కమొగిందన్నుఁదాకి వారినెల్లరఁ బరాభూతు
లనొనర్చి యతండంగరాజునుసమూపించెను. అప్పుడయ్యిరువుర
కును భయంకరముగనెడతెగని పోరాటముజరిగెను. ఆదీర్ఘసం
గరమునఁ బరస్పరశరాహతులచే నెత్తురుజొత్తిల్లెడు మేనులతోఁ
గర్ణాభిమన్యులిరువురును సంధ్యాసమయమందలి సూర్యబింబప్ర
తిబింబములవలె శోభిల్లుచుండిరి. అప్పట్టునఁ గర్ణునిసేనాధిపతు
లార్వురశిర్వాగర్వంబున నాకవ్వడికొడుకునెదుర్కొన నతండువారిం
జిత్రవధగావించెను. అందువలన మహాయోధులగు కుంభసంభ
వాదులు మరలవాని పైవిజృంభించిరి. అందుమగధేశ్వరునికుమా

డుఁడైన యశ్మంతకుఁడు బాలుఁడయ్యు బాహువిక్రమము మెరయ
నతిసంరంభమున నభిమన్యునిపైఁబడెను. కాని వానిసారథితల
యు నశ్వములతలలును నేలరాల్చి యాతలలతోడనే యతనిత
లయు నర్జునకుమారుఁడు చప్పునఁ గ్రిందఁబడ నేసెను.

అట్లశ్మంతకుని నంత మొనరించి, యయ్యనంతవిక్రముఁ
డుసింహనాదంబొనర్చ, దుస్సేనునిపుత్రుఁడు కడురభసంబున
నరుదెంచి, యభిమన్యుని ఘోటకముల నాలుగమ్ములను వానిసా
రథినొక్కయమ్మునను, నవయవమ్ములఁబదియమ్ములను నొప్పించె
ను. తన్ను నొప్పించిన దుస్సేనునిసూనుని గోపంబు పెంపున నె
ఱ్ఱదామరలఁబోలుకనుంగవతోఁ జూరచూరఁజూచి, యుజ్వలబాణ
పీడితుంజేసి "ఓరీ! నీతండ్రి యింతకుమున్నెదిరించి యోడి పారి
పోయెను. ఇప్పుడునీవు నన్నుసమీపించితివి. కానినిన్నుమాత్రి
మ్ముల్లుపారిపోనీయనుజుమా" యని గంభీరముగఁబలుకుచు నభిమ
న్యుఁడొకదొడ్డనారసము కడుతీవ్రముగ వానిపై విడిచెను. అప్పు
డుద్రోణినందనుఁడడ్డమై యాబాణమునుమార్గమధ్యమున నేతు
నియలొనరించి దుశ్శాసనకుమారునకుఁ బ్రాణదాతయయ్యెను.
నరనందనుఁడా గురునందనునిదిక్కు చూడక, దుశ్శాసననందనుని
విడువక, వానిచాపమ్మునరికి, సూతునిఁగడతేర్చి యతనియుర
మ్మున నారమ్ములుగుచ్చినంతనే, యాబాలుఁడు చెంతనున్న వే
రొక్కయరదం బెక్కి ప్రాణములుదక్కినవని తనవారి దిక్కున
కుఁబోయి యచ్చటిసేనలలోనక్కెను. ఇంతలో నపరాహ్ణసమ
యంబయ్యె. ఆసమయమున శత్రుంజయుఁడును జంద్రకేతుఁ
డును సువర్చసుఁడును సూర్యభానుఁడును మేఘవేగుండు నను
వీరులుమొత్తంబైతన్నుఁదాకఁ బార్థపుత్రుఁ డయ్యేవుర రక్షి

మాకుని రణకౌశల్యమునుజూచి యాతఁడెంతయో సంతసింపవల
సియుండెను. లేదా, యందరుమహాయోధులతోఁగూడఁదానొ
క్క పసిబాలుని విజృంభణ మణఁపఁజాలనందుకు సిగ్గుపడవలసి
యుండెను. సిగ్గుపడి ధనుర్విద్యకు నాచార్యుండగుట చేవఁసినం
తపౌరుషమును వహింపవలయును. ఇందేదియును లేక, కిరాతు
లుమాటుపన్ని మదించినగజమునుగడ తేర్పనెంచినట్లు పాపమా
బాలకుని నంత మొసరింపనెంచి, ద్రోణుఁడెంతటి యప్రయోజ
కుఁడును గఠినచిత్తుఁడునయ్యెను! ఆదినుండియు దుష్టచతుష్టయ
మున నుకఁడై, యీమహాభారత యుద్ధమునకు మూలపురుషుఁ
డై పాండుకుమారులపేరైనవిని సహింపలేని కర్ణునకా యిట్టి
చోపదేశము? హర! హరా! ఈసై వృత్తాంతమెంత సంతాప
కరమైనది !

అట్లుద్రోణునిచేనుపదేశింపఁబడి, కర్ణుఁడుభయపడినవా
నివలెనటించుచు మెల్లఁగ నభిమన్యునివెనుకకుఁజుట్టివచ్చి, యా
వంచనకు సహాయులై పెనంగిన సైనికులనేకులతోఁ బోరాడు
చుండిన యాకుమారవీరునిసమీపించి, తటాలున వానివిల్లుఖం
డించెను. ఖండించుటయెతడవుగ నశ్వత్థామ వానియశ్వములఁ
బడనేసెను. అయ్యశ్వములవెంటనే కృపుండు సారథినిగడతే
ర్చెను. ఇట్లువిరథుండును నిరాయుధుండునగు నబ్బాలునియెడ
భయంబుదక్కి శకునికృతవర్మశల్యబాహ్లీక గురుసుతాదులనేక
లు మహారథికులమని విఱ్ఱవీగుచుఁ దుపాకిదెబ్బచే నేలఁగూలిన
బెబ్బులిని బోయలుచుట్టుకొనినట్లు చుట్టుకొని, యాకుమారవీ
రునిసుకుమారశరీరమునఁ దీవ్రశస్త్రాస్త్రములనేకములు గాఢ
ముగనాటించి మిక్కిలిబాధింపఁదొడంగిరి. తోడనే చిక్కువడి

యేమిచేయుటకుం దోఁపక తానునేర్చినవిద్యాప్రభావమున నొక
డాలునుగత్తియుఁగొని సుభద్రానందనుఁడు వినతానందనుని
లేఁదనరథంబుతోఁగూడ రివ్వునగగనభాగంబున కెగసెను.
చూచి యయ్యోధవరులెల్లరు మరలభయాకులచిత్తులై
స్మికముగఁ బైనుండి సౌభద్రుండెవ్వరిపైఁబడి యెవ్వరినంతమొన
రించునోయని యూరకతత్తరపడసాగిరి. ఆతత్తరపాటు తొలం
గునట్లు గురుండు వెంటనే యొకబల్లెమ్మున నభిమన్యుని కేలంగల
కరవాలమునుఖండింపఁ గర్ణుండును వానిడాలును శకలంబులొ
నరించెను. అప్పుడయ్యసహాయస్థితి కర్జునకుమారుండు లేశము
నుభీతిల్లక, తనరథంబుపైఁగల చక్రాయుధంబును గైకొని, యు
పేంద్రునివలెశోభిల్లి నెత్తురుగారుచునాగ్రహాతిశయమునఁ గడు
నుగ్రంబయిన ముఖముకాంతులతో, కౌరవసేనాసమూహము
ల గుండెలుబ్రద్దలుసేయు భయంకరసింహనాదముతో, నాకస
మునంటురథాంగప్రభలఁగలసి భాసిల్లుమణికంకణద్యుతులతో,
నంకుశేఁపుఁబోటునఁ జెలంగిన గంధసింధురసంరంభముతో, నా
కుంభసంభవునిపైఁ విజృంభించి, యడ్డుపడిన సేనలనెల్ల నతిసూ
క్ష్మముగఁ జెండాడుచుండ, నమ్మేటిమగని మగతనమును బలము
నుజలమును వేలుపులు వేనోళ్ళఁగీర్తింపఁదొడంగిరి. అప్పుడుశ
కునికృతవర్మకృపకర్ణశల్యముఖ్యులైన యోధులుపలువురుమరల
నలుదెసల నతనింజుట్టుముట్టి వానిచక్రాయుధమునుదునియలొ
నరించిరి. అభిమన్యుండును నుద్దండగదాదండమునొండుదాల్చి
గురునందనునిపైఁబడ, వజ్రాయుధమువలెధగధగలాడునాగదా
యుధమునుజూచి, తనకింకఁ బ్రాణములు దక్కవనియెంచియతం
డురథమునుడిగ్గి వెనుకకుఁజనియెను. సౌభద్రుఁడువానిసారథిని

రథ్యములఁ జావమోఁది, తనకడ్డముగనున్న మహాప్రతీకముల నెల్లఁ ...కిపారవైచు జంఝానిలునికైవడిఁ జెలరేఁగి, గాంధారవీరుల ని... యేడ్వురనుక్కడంచి తన్నుమార్కొనిన వసాతీయులఁ బదు... సేనుంగులతోఁడ నె పీనుంగులఁగావించి యందందుఁ దన్నడ్డగించుచువచ్చిన కేకయసప్తకంబును రథసమేతంబుగా రూపుమాపి, డస్సియోడిపరుగిడిపోయెడి యోధులం గని కలకలనవ్వుచునుల్లాసంబాడుచు నాకుమారవీరుఁడు తనవీరచరితమును గడుఁ ధీరత్వనిష్ఠతోఁ జరుపుచుండెను.

ఆసమయమున దుశ్శాసనకుమారుఁడు తనయరదంబును సంసిద్ధమొనర్చుకొని యభిమన్యుం దాఁక, నతఁడు వానిసారథినడచి హయములఁ బడ నేసెను. అంతతోఁ జోక దౌశ్శాసని తురంగరహితంబగు తనశతాంగమును లంఘించి సౌభద్రునితో గదాయుద్ధమునకుఁ దొడంగెను. తమ్ముఁ జూచువారికద్భుతమును సంతాపమును గలుగ, శరీరమ్ములు రుధిరధారాపూరితమ్ములై చెలఁగ నాడయ్యన్నదమ్ముల బిడ్డలిరువురు నతిభయంకరముగఁ బోరాడిరి. కొంతసేపునకు సౌభద్రుని గదాఘాతమ్ములనోర్వఁజాలక దుశ్శాసనసూనుఁడు గతప్రాణుఁడయ్యె. కమలాకరమునఁ జొచ్చిన వనగజమును నిర్దయులయిన కిరాతులు చుట్టుముట్టికడ తేర్చునట్టు లాసమయమ్మున—హరహరా! అచ్చటిమహాయోధులెల్లరుఁ గూడి—రామ రామ!— నిర్దయులై మన యభిమన్యుకుమారుని—శివశివా!— తాముపన్నినకృత్రిమవిధానమున—కటకటా! .......... వేసిరి.

ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః

—

